జూన్ 2009 ■ Rs.20/-



# చందమామ

లోపల 10
బుక్ లేబుల్స్

28
ఇరాక్ జానపద కథ
## మహిమగల నశ్యం

48
మన చరిత్ర పుటల నుంచి
## రెండు చెట్ల కథ

71
భయమెరుగని నలుగురు
## అసలు సంగతులు































*1 కాంతి సంవత్సరం = 5878171478565.18 మైల్లు (దాదాపు)

కొనసాగనుంది...

# ఈ సంచికలో...



చందమామ

సంపుటి: 62 జూన్ 2009 సంచిక: 06













# మళ్ళీ బడికి

ఈ సంచిక మీ చేతుల్లోకి వచ్చేసరికి మీలో చాలా మంది మళ్ళీ బడికి వెళ్ళడానికి సంసిద్ధులవుతూ ఉంటారు. మళ్ళీ పుస్తకాలు-చదువులు, ఆటలు-పాటలు, విజ్ఞానం-వినోదం అంటూ సర్వతో ముఖాభివృద్ధి సాధించడానికి నవనవలాడే ఉత్సాహంతో నూతన విద్యా సంవత్సరంలో అడుగుపెట్టే అమృత ఘడియలు ఇవి!

పాఠ్యాంశాలపై పట్టు సాధించి ప్రథమశ్రేణిలో రావాలని ప్రతి విద్యార్థి ఆశించడంలో ఆశ్చర్యంలేదు. ఆశించి తీరాలి. అదే విధంగా ఉన్నత విలువలు పెంపొందించుకోవడంలో సైతం ముందు వరుసలో ఉండడానికి కాంక్షించడం కూడా అంతే అవసరం. ఎందుకంటే ఏ దేశానికైనా సంపదలన్నిటిలోకీ అమూల్యమైనది మానవ సంపద. మానవ సంపద అంటే మనుషులు; ఉన్నత విలువలు పాటించే మనుషులు! అలాంటి ఉదాత్తమైన విలువలను చిన్నారుల హృదయాలలో పాదుకొల్పడానికి గత ఆరు శతాబ్దాలకు పైగా చందమామ చేస్తున్న కృషి జగద్విదితం! విజ్ఞులు సెలవిచ్చినట్టు నేటి బాలలే కదా రేపటి ఉజ్వల జీవిత ఆశాజ్యోతులు; భావి భారత భాగ్యవిధాతలు!

నీతి-నిజాయితీ, నిరంతర ప్రయత్నం, అనుకున్నది సాధించే పట్టుదల మొదలైన సుగుణాలే మనిషిని మనిషిగా నిలబెడతాయి. అభ్యుదయ పథంలో నడిపిస్తాయి. ప్రపంచమే ఒక కుగ్రామమైపోయిందని చెబుతూన్న ఈనాటి 'గ్లోబల్ ఆర్డర్'లో ఇవి మరీ ముఖ్యం!

అయితే, నైతికవిలువలను విడమరచి చెప్పే నిర్దిష్ట పాఠ్యాంశాలు లేవు. వాటిని తరగతులలో పద్ధతిగా బోధించడం లేదు. వాటికంటూ ప్రత్యేకంగా పరీక్షలు లేవు. జీవితంలో మనం సాధించే విజయాలు సుస్థిరమై, మనం సంతోషంగా ఉండాలంటే నైతిక విలువలు పాటించడం చాలా అవసరం. అంతేకాదు, ప్రస్తుత పోటీ ప్రపంచంలో ఒకరినొకరు అధిగమించాలనే ఉబలాటంతో, మితిమించిన స్వార్థంతో, పేరాశతో చిన్నప్పుడు నేర్చిన నైతిక విలువలను ఉదాసీనపరచడమే పలు సామాజిక రుగ్మతలకు, అపశ్రుతులకు మూలకారణమని కొంచెం ఆలోచిస్తే అవగతమవుతుంది!

ఈ పరిస్థితిని అధిగమించడానికి ఏం చెయ్యాలి? ప్రాథమిక విలువల ప్రాముఖ్యతను గ్రహించాలి. నీతిగా, నిజాయితీతో, మన శక్తిసామర్థ్యాలను, నైపుణ్యాలను పెంపొందించుకోవాలి. మనకన్నా తక్కువ స్థాయిలో ఉన్నవారు సైతం మనలాంటి వారేనన్న మానవతాదృక్పథం అలవరచుకోవాలి. అందుకు అనుగుణంగా మసలుకోవాలి. కష్టాలను, ఆకర్షణలను ధైర్యంగా ఎదుర్కొని నిలబడగల ధీశక్తి పెంపొందించుకోవాలి! ఏ రంగంలోనైనా విజయం సాధించడానికీ, సాధించిన విజయాలను సుస్థిరం చేసుకుంటూ మరిన్ని నూతన శిఖరాలను అధిరోహించడానికీ ఇలాంటి ఉన్నత విలువలే పునాదులన్న ఉదాత్త సత్యాన్ని గ్రహించాలి! రండి; అలాంటి సదవగాహనతో నూతన విద్యాసంవత్సరానికి ఉత్సాహంతో స్వాగతం పలుకుదాం!

సంపాదకుడు : ఎల్. సుబ్రమణ్యాన్



***Founded by***
**B. Nagi Reddi and Chakrapani**

***Chairman :*** B. Viswanatha Reddi (Viswam)
***Editor & Publisher :*** L. Subramanyan
***Associate Editor :*** A.R. balasubrahmanyam
***Senior Artists:*** K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh
***Artist :*** Jayapandian
***Asst. Editor-Copy & Pre-Production :*** R. Sudha
***Creative Writer :*** R. Vaasugi
***Layout Designers :*** M. Nagaraj, B. Thirumal

***CIRCULATION TEAM :***
***Chennai :*** **T N Ravi Shankar, *National Sales Manager*,** Mobile +91 99620 70014
email : ravishankar.tn@chandamama.com

**Fazal Khan, *Manager-Circulation & Institutional Sales - South*,** Mobile +91 99625 67860
email : fazal.khan@chandamama.com

***Mumbai :*** **Rajendra K Jadhav, *Asst. Manager-Circulation*,** Mobile +91 9320565048
**CHANDAMAMA INDIA LTD.,**
B-3, Lunic Industry, Opp. State Bank of India, Near Police Station Cross Road, No.6, MIDC Andheri (East), Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
email : rajendra.jadhav@chandamama.com

***New Delhi :*** **Sushil Sharma, *Circulation Manager-North*,** Mobile +91 99110 91022
**CHANDAMAMA INDIA LTD.,**
Goyal Business Centre, C-23/2 First floor, Connaught Place, New Delhi-110001

***Bangalore :*** **P. Murali, *Asst. Circulation Manager - Karnataka*,** Mobile +91 94488 36952
**CHANDAMAMA INDIA LTD.,** 18, 10th Cross, Mayura Street, Papanna Lay Out, Outer Ring Road, RMV 2nd Stage, Bangalore-560094,
Phone +91 80 6655 1000
email:murali.p@chandamama.com

***Kolkata :*** **Ananth Prakash, *Circulation Manager-East*,** Mobile +91 98362 82202, 98351 82202
email : ananth.prakash@chandamama.com

***Ahmedabad :*** **Kalpesh Raval, *Sales Officer-Circulation*** Mobile +91 98245 19946
email : kalpesh.raval@chandamama.com

***Content Head - Online :*** **Sowmya Bharadwaj**
email : online@chandamama.com

***Assistant Manager - Marketing :*** **Vidhi Kumar**
email : marketing@chandamama.com

***Advertisement :***
email : sales@chandamama.com
***Subscription Queries:*** L Govindasamy
e-mail : govindaswamy.l@chandamama.com
***Customer Cell :*** A B Sairam
Mobile: +91 9841983774
e-mail : sairam.ab@chandamama.com
***Production Executive :*** Panchakshari R Math

***Head Office :*** **CHANDAMAMA INDIA LTD.,**
2/513 (Old 3/396), Sundeep Avenue East, 2nd Main Road, Chinna Neelankarai, Chennai - 600 041 Phone +91 44 43992828, Fax +91 44 43992829
Email : chandamama@chandamama.com
Website : www.chandamama.com




# పాఠకుల లేఖలు



 ఏప్రిల్ నెల తెలుగు చందమామ కొని చదివాను. కథలన్నీ అద్భుతంగా ఉన్నాయి. కానీ ముఖచిత్రం చూస్తే పుస్తకం చందమామ అన్న భావం రాలేదు. దయచేసి మన 'చందమామ'కు సహజ సుందరంగా ఉండే గత 62 సంవత్సరాలుగా వేస్తున్న 'సాంప్రదాయ' చిత్రాలే వెయ్యవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

–ఎం.వి. చంద్రశేఖర శాస్త్రి, గుంటూరు.

 ఫ్యామిలీ మ్యాపు, పరిసరాల పరిశుభ్రత, ఎన్నికలలో పరిశీలన అంశములు గురించి తెలుసుకోవాలని చెప్పి సంపాదకీయంలో చక్కగా రాశారు. బాగుంది. రామయ్య మిఠాయి వ్యాపారం సామాజిక పరంగా బాగుంది. దుర్యోధనుడికి గుడులుండటం తప్పు కాదు. టి.వి రామాయణంలా మన రామాయణం చాలా రంగులమయంగా బాగుంది.

–వాస్తు రామచంద్ర, నెల్లూరు-*2*

 ఆకాశంలో కనిపించే చుక్కల్లో చందమామలా ముత్యాల్లాంటి అక్షరాలతో, సందర్భోచితమైన పంచరంగుల చిత్రాలతో, అందరికీ అర్థమయ్యే భాషలో, కాలానుగుణంగా క్విజ్, జి.కె, క్రీడా విశేషాలతో; నీతి, సందేశాత్మకమై, విజ్ఞాన, వినోదభరితమై; పౌరాణిక, చారిత్రక, జానపద, కథానికలతో, సీరియల్స్‌తో ఆబాలగోపాలాన్ని ఆనాటి నుంచి, ఈనాటి వరకు అలరిస్తోంది. ఎప్పటికీ అలరిస్తుంది. అంతటి శక్తి, సత్తా, కీర్తి ప్రతిష్ఠలతో అమూల్యమైన కనిపించని ఆస్తిని సంపాదిస్తున్నది చందమామ మాసపత్రిక.

ఇలా చదివి అలా కిరాణా కొట్లో పొట్లాలు కట్టే పత్రిక కాదిది. పదికాలాలపాటు పదిలపరుచుకునేలా చేస్తుంది. నేను కూడా అదే చేస్తున్నాను. కవితలు, ఛలోక్తులు, జోకులు, మేజిక్కులు, పజిల్స్, డ్రాయింగ్‌లు బాలల స్థాయిలో చందమామలో చోటుచేసుకుంటే బాగుంటుందేమో! –విశ్వనాథ్ జోషి, తాండూరు-*501141*



మీ అభిప్రాయాలను ఈమెయిల్
feedback@chandamama.com
ద్వారా, SMS MLANG <space> <Name, Age> <space> <TEL your feedback> 54646 ద్వారా పంపవచ్చు.






# పద్మగంధి పుష్పం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ‘‘రాజా, ఏ స్వప్న సాఫల్యం కోసం నువ్విలా అచంచలమైన పట్టుదలతో అపరాత్రివేళ భీకర వాతావరణంలో పోరాడుతున్నావో నాకు తెలియదు. ఇది ప్రేమకు సంబంధించిన ప్రయత్నమైతే మాత్రం నీ తుది నిర్ణయం మరెంతగా మారిపోతుందో ఊహించడం అసాధ్యం. ఈ విషయంలో సుమంతుడనే క్షత్రియ యువకుడు నడుచుకున్న వింతమైనం గురించి చెబుతాను, శ్రమ తెలియకుండా విను,’’ అంటూ ఇలా చెప్పసాగాడు:

ముకుందపురం యువరాణి రత్నవల్లి అందాలరాశి. అంతకు తీసిపోని అహంభావి. అందుకే తనను కోరి వచ్చిన బంధువూ, పొరుగు యువరాజూ అయినసుమంతుడికి-



అనుక్షణం రంగులు మారే పద్మగంధి పుష్పాన్ని తెచ్చి సిగలో తురిమితేనే వివాహం చేసుకోగలనని నిబంధన విధించింది!

పద్మగంధి పుష్పం దక్షిణ సముద్రం మధ్య ఉన్న ముత్యాలదీవిలోని నెమళ్ళవనంలో వసంత రుతువులో ఒకే మొక్కకు ఒక్కసారి మాత్రమే పుష్పిస్తుంది. అక్కడికి వెళ్ళడమంటే ప్రాణాలు పణంగా పెట్టడమే. అయినా రత్నవల్లిని వివాహమాడాలన్నది సుమంతుడి సురుచిర స్వప్నం. అందువల్ల వెంటనే బయలుదేరాడు. ఐదు రోజుల ప్రయాణం తరవాత అడవిమార్గం గుండా వెళుతూన్న సుమంతుడి గుర్రాన్ని దాటుకుని మగదుస్తుల్లో ఉన్న ఒక యువతి గుర్రం ముందుకు దూసుకుపోయింది. సుమంతుడు తన గుర్రాన్ని మరింత వేగంగా నడిపి ఆ యువతిని అధిగమించాడు. ఇలా ఇద్దరూ పోటీపడి ఒకరినొకరు అధిగమిస్తూ సాయంకాలానికి అలిసిపోయి ఒక చెట్టు నీడన చేరారు.

ఆమె అద్భుత సౌందర్యానికి ముగ్ధుడైన సుమంతుడు కన్నార్పకుండా ఆమెకేసి చూసి వెంటనే తేరుకుని సర్దుకున్నాడు. ఆమె అతడికేసి మందహాసంతో చూడసాగింది. ఇరువురూ పరస్పరం పరిచయం చేసుకున్నారు. ఆమె పేరు మేఘజ్యోతి. పుణ్యగిరి గ్రామానికి చెందిన మల్లినాథుడనే భూస్వామి కూతురు. ఆమె ప్రయాణం కూడా పద్మగంధి పుష్పం కోసమే. ఆమె తండ్రికి సంక్రమించిన వింత జబ్బు పద్మగంధి పుష్పం రేకులతో తయారైన ఔషధంతోనే నయమవుతుందని వైద్యులు చెప్పారు.

వాళ్ళిరువురూ మాట్లాడుకుంటూండగా అటుగా వచ్చిన పెద్దపులి వారి మీదికి దాడి చేయబోయింది. సుమంతుడు కత్తిదూశాడు కాని, మేఘజ్యోతి అతణ్ణి వారించి, ''ఆగు! మేము జింకపిల్లలమో, కుందేటి కూనలమో కాము చంపి హాయిగా తినడానికి! అనవసరంగా మా చేతుల్లో చావకుండా వెంటనే వెళ్ళిపో,'' అంటూ పులిని చూపుడువేలుతో ఆజ్ఞాపించింది.

పెద్దపులి తోక ముడుచుకుని వెళ్ళడం చూసిన సుమంతుడు, ''నీ భాష జంతువులకు అర్థమవుతుందా? లేకుంటే నువ్వు ఏదైనా మాయ చేశావా?'' అని అడిగాడు ఆశ్చర్యంగా.

మరిన్ని బేతాళ కథలకు telugu.chandamama.com చూడండి

‘‘మానవభాష జంతువులకెలా అర్థమవుతుంది? నా మాటల్లోని బెదిరింపుకు అది హడలిపోయింది. మహాబలుడైనా భయపడితే నిలబడలేడు కదా? నా పక్కన తమరున్నారు కదా! మీ అండ చూసుకునే అలా బెదిరించాను,’’ అన్నది మేఘజ్యోతి నవ్వుతూ.

అప్పటికే చీకటి పడ్డంతో వాళ్ళిద్దరూ చెట్టుకిందే నిద్రపోయారు. తెల్లవారుజామున సుమంతుడికి మెలకువ వచ్చింది. అబల అయినా పోటీలో ఉపేక్షించకూడదని నిద్రపోతూన్న ఆమెను అక్కడే వదిలి బయలుదేరాడు. చాలాదూరం ప్రయాణం చేసి దక్షిణ సముద్రతీరం చేరేసరికి అక్కడ మేఘజ్యోతి అతడి కోసం ఎదరుచూస్తోంది. ‘‘నాకన్నా ముందు ఎలా వచ్చావు?’’ అని అడిగాడు సుమంతుడు అమితాశ్చర్యంతో.

‘‘అడ్డదారిలో వచ్చాను. మగవాడికి తొందరపాటు వల్ల తప్పటడుగులేపడతాయి. నిదానం వల్ల ఆడది సులభంగా గమ్యం చేరగలుగుతుంది,’’ అన్నది మేఘజ్యోతి చిన్నగా నవ్వుతూ.

‘‘అలాగా!’’ అని సుమంతుడు ఆమెతో కలిసి సముద్ర ప్రయాణం చేయడం ఎలాగా అని ఆలోచిస్తూ తీరం వెంట నడవసాగాడు. దూరంలో ఎప్పుడో ప్రమాదం కారణంగా సముద్రం నుంచి ఒడ్డుకు కొట్టుకువచ్చి పడి ఉన్న పడవ ఒకటి కనిపించింది. ఆ పడవలో ఇరువురూ ముత్యాలదీవి కేసి బయలుదేరారు.

పడవ ముత్యాలదీవిని సమీపిస్తూండగా సముద్రంలో హఠాత్తుగా పెను అలజడి ఆరంభమయింది. దాంతో పడవ నిముషాల్లో ముక్కలయింది. ఒక పడవ చెక్కను దొరక





పుచ్చుకున్న మేఘజ్యోతి, నీళ్ళల్లో ఉక్కిరి బిక్కిరవుతూన్న సుమంతుడికి దాన్ని అందించి, దీవికి వెళ్ళిపొమ్మని చెప్పింది. సుమంతుడు దాని సాయంతో అతి ప్రయాస మీద ఆ దీవిని చేరుకున్నాడు. అయితే అప్పటికే అక్కడ మేఘజ్యోతి అతడి కోసం ఎదురుచూస్తున్నది.

ఎలా వచ్చావని అతడు ప్రశ్నించకముందే, ''ఏడు తాటిమానుల ఎత్తున్న సముద్రపు అల అంచుకు చేరుకోవడం నాకు గుర్తున్నది. నా అదృష్టం కొద్దీ అలాంటి అలలు ఒకదాని వెనక ఒకటి నన్ను విసిరివేయడంతో ఒడ్డున పడ్డాను. ఇది దైవానుగ్రహం తప్ప మరొక్కటి కాదు,'' అన్నదామె.

ముత్యాలదీవి దట్టమైన అడవి. వాళ్ళు చూస్తూండగానే భయంకరమైన కారుచిచ్చు వాళ్ళను చుట్టుముట్టింది. మంటలలో చిక్కుకుని మాడి మసికాక తప్పదని సుమంతుడు కంగారు పడుతూండగా, ''మీకు ఎలాంటి భయమూ వద్దు. ఎదురు ప్రశ్న వేయకుండా నా చెయ్యి పట్టుకోండి,'' అన్నది మేఘజ్యోతి.

సుమంతుడు ఆమె చేయి పట్టుకోగానే ఇరువురూ గాలిలోకి లేచారు. అలా ఆకాశంలో పయనించి సురక్షిత ప్రదేశంలో నేలమీదికి దిగారు.

''మేఘజ్యోతీ, నువ్వు మానవకాంతవు కావు. నిజం చెప్పు,'' అన్నాడు సుమంతుడు.

ఇక అసలు సంగతి దాచలేనని గ్రహించిన మేఘజ్యోతి అతడంటే తనకు ఇష్టం గనక, తనను గురించిన వివరాలు తెలియజేసింది:

దండకారణ్యంలో మహాజిహ్వుడు, విశ్వభీతి అనే రాక్షస దంపతులు తరచూ విచారానికి లోనయ్యేవారు. మానవజాతి పెరిగే కొద్దీ రాక్షసజాతి అంతరించిపోతున్నది. అందుకు కారణం తమలోని క్రౌర్యం, దుష్టబుద్ధే అని కూడా వాళ్ళు గుర్తించారు. అందువల్ల క్రూర స్వభావాన్ని విడనాడి కందమూలాలు, అడవి ఫలాలు మాత్రమే భుజిస్తూ సాధుస్వభావులుగా మారారు.

ఇలా ఉండగా వారికొక కూతురు పుట్టింది. తమ బిడ్డను మానవజాతిలో కలిపితే తమ తరవాతి తరాల వాళ్ళు మానవులుగా కలకాలం జీవించగలరని వాళ్ళు ఆశించారు. వెంటనే తమకున్న శక్తులతో పసికందును అందాల మానవ శిశువుగా మార్చారు. పుణ్యగిరి గ్రామంలోని మల్లినాధుడనే భూస్వామి

భార్యకు జన్మించిన మృతశిశువు స్థానంలో తమ బిడ్డను ఉంచారు. మల్లినాథ దంపతులు ఆ బిడ్డను తమకు కలిగిన సంతానంగానే భావించి మేఘజ్యోతి అని పేరుపెట్టి అల్లారు ముద్దుగా పెంచుకోసాగారు.



మేఘజ్యోతి ఐదేళ్ళ పాపగా ఉన్నప్పుడు తమ కూతురి ముచ్చట్లు చూడడానికి రాక్షస దంపతులు మానవరూపాలతో పుణ్యగిరికి వచ్చారు. ఆడుకుంటూన్న మేఘజ్యోతికి జన్మ రహస్యం తెలియజేసి, ఆమెకు జన్మతః ఉన్న కొన్ని అతీత శక్తుల గురించి చెప్పారు. వాటిని తప్పనిసరి పరిస్థితులలో మాత్రమే ఉపయోగించాలని హెచ్చరించి వివాహం తరవాత అవి ఉండవని చెప్పి, సుఖంగా జీవించమని దీవించి అదృశ్యమైపోయారు. మేఘజ్యోతి పుణ్యగిరి మల్లినాథుడి కూతురుగానే పెరిగి పెద్దదయింది.

మేఘజ్యోతి గురించి తెలుసుకున్న తరువాత, సుమంతుడికి ఆమెపై గౌరవం పెరిగింది. ఇరువురూ మాట్లాడుకుంటూ నెమళ్ళవనం సమీపించారు. అక్కడ సులభంగానే వారికి రంగులు మారే అందమైన పువ్వుతో పద్మగంధి మొక్క కనిపించింది.

''నువ్వే గనక లేకుంటే నేనిక్కడికి వచ్చి ఉండేవాణ్ణికాను. ఈ సాహసయాత్రలో పరిపూర్ణ విజేతవు నువ్వే. పద్మగంధి పుష్పం నీకే దక్కాలి,'' అన్నాడు సుమంతుడు.

''మా తండ్రి వృద్ధుడు. వ్యాధి నయమైనా ఎంతో కాలం జీవించబోడు. ఈ పుష్పం లేకపోతే నీ చిరకాల స్వప్నం భగ్నమవుతుంది. పెళ్ళికి ముందు వధువు కోరిక వరుడు నెరవేరిస్తే, అతడికి ఆమె హృదయంలో సుస్థిర స్థానం లభిస్తుంది. కాబట్టి ఆ పుష్పాన్ని నువ్వే తీసుకో,'' అన్నది మేఘజ్యోతి.

దాంతో సుమంతుడికి పుష్పాన్ని తీసుకోక తప్పలేదు. ఆ తరవాత ఇద్దరూ రెండు నెమళ్ళను వాహనాలుగా చేసుకుని స్వస్థలాలకు చేరుకున్నారు.

పుష్పంతో వచ్చిన సుమంతుణ్ణి చూసి రత్నవల్లి, అతణ్ణి అభినందించకపోగా,'' ఈ మాత్రం పుష్పాన్ని తీసుకురావడానికి ఇంత ఆలస్యమా?'' అని ఈసడించింది.

సుమంతుడు, ''ఈ పుష్పాన్ని నీకివ్వడానికి తీసుకురాలేదు. నా సమర్థతను నిరూపించుకోవడానికే తెచ్చాను. నువ్వు ప్రాథేయపడినా

నిన్ను నేను వివాహమాడను,'' అని చెప్పి అప్పటికప్పుడే పుణ్యగిరి గ్రామానికి బయలు దేరాడు. పద్మగంధి పుష్పాన్ని మల్లినాధుడి వైద్యానికి ఇచ్చి, మేఘజ్యోతిని వివాహం చేసుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, సుమంతుడి ప్రవర్తన విడ్డూరంగా లేదా? తన చిరకాల స్వప్నం నెరవేరనున్న సమయంలో అతడు ఎందుకలా మూర్ఖంగా ప్రవర్తించాడు? రత్నవల్లి చనువుకొద్దీ అన్న మాటను ఎందుకంత అవమానంగా భావించాడు? మేఘజ్యోతి రాక్షస పుత్రిక అని తెలిసీ ఆమెను వివాహమాడడం అవివేకం కాదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''రత్నవల్లిని వివాహమాడాలన్నది సుమంతుడి చిరకాల స్వప్నమే అయినా, అది కోరిక మాత్రమే; ప్రేమ కాదు. రత్నవల్లికి కూడా అతడి మీద ప్రేమ లేదు. ప్రేమ ఉన్నట్టయితే పెళ్ళికి నిబంధన విధించేది కాదు. ప్రాణాలు పణంగా పెట్టి పయనం సాగించి జయప్రదంగా తిరిగి వచ్చిన సుమంతుడి సాహసాన్ని ఉదాసీన పరచడం ఆమెలోని అహంభావానికి పరాకాష్ఠ. ఇవన్నీ గ్రహించడంవల్లే సుమంతుడు ఆమెను తిరస్కరించాడు. ఇక అతడికి మేఘజ్యోతిపై కలిగినది ప్రేమ. ఆమె తన ఉన్నతమైన ప్రవర్తనతో ఆ ప్రేమను ఇనుమడించేలా జేసింది. పుట్టుక చేత దానవకన్య అయినప్పటికీ మానవులకు మించిన మానవత్వాన్ని ప్రదర్శించింది. రాక్షసులే అయినప్పటికీ ఆమె కన్నవాళ్ళ అభిమతం ఉదాత్తమైనది. వాళ్ళ అభిమతానికి అనుగుణంగా నడుచుకుని, ఆమె తను కూడా యేడాదికోసారి పూచే పద్మగంధి పుష్పం లాంటిదేనని నిరూపించింది. అందుకే సుమంతుడు ఆమెను వివాహమాడాడు. వివాహంతో ఆమె పరిపూర్ణ మానవ కాంతగా మారిపోయింది,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. -(కల్పితం)

*[ఆధారం: గుండ్రాతి సుబ్రహ్మణ్యం గౌడు రచన]*






ముని సలహా ప్రకారం ఆర్య తూరుపు ప్రాంతానికి వెళ్ళాలని నిర్ణయించాడు. అంతకు ముందే తూరుపు ప్రాంతానికి చేరిన ప్రభాత్ రాజప్రతినిధిని కలిశాడుగాని దర్యాప్తులో అతడు అంతగా సాయపడలేకపోయాడు.

నేను వేకువజామునే బయలుదేరుతాను. నేనెక్కడికి వెళ్ళిందీ వేరెవ్వరికీ తెలియకూడదు.

ప్రజలకు నన్నేం చెప్పమంటారు?

నాకు ఆరోగ్యం బాగాలేదని చెప్పు. ప్రభాత్ తిరిగి రాగానే నువ్వు అతణ్ణి నమ్మకంతో సంప్రదించవచ్చు.

తమ నిర్ణయంలో మార్పు రాదంటారా?

పాలకుల నిర్ణయాలలో మరీ అంత దృఢంగా ఉంటే చరిత్ర గమనం మరింత నిస్తేజంగా ఉండేది!

అక్కడ, మరింత చొరవతో ముందుకు సాగడానికి రాజప్రతినిధి సుముఖంగా లేకపోవడంతో ఆగ్రహం చెందిన ప్రభాత్ తన దర్యాప్తును కొనసాగించాలనుకున్నాడు.

హఠాత్తుగా...

నా కళ్ళు మూసుకు పోతున్నాయి... ఏమిటిది!











అతడేదో అడవిలో పడిపోయినట్టుయింది. గాఢాంధకారం విరుతవేగంతో చుట్టుముట్టి కమ్ముకున్నది.


ప్రభాత్ స్పృహలోకి వచ్చాడు...
...అయితే తనను
తాను తెలుసుకునే
స్థితిలో లేడు.
నమ్మకమైన గుర్రం భీకరంగా ఉన్న తన యజమానికేసి వింతగా చూసింది.
దాని మనసులో భయం చోటుచేసుకున్నది.


మర్మాన్ని ఛేదించాలన్న దృఢ నిర్ణయంతో, ఆర్య తూరుపు ప్రాంతంకేసి బయలుదేరాడు.
తమరెందుకలా విచారపడతారు మహారాణీ? రాజవైద్యులు రాజుకు త్వరలో స్వస్థత సమకూర్చగలరు!
ఆ పాడు రోగం రాజును నా నుంచి దూరం చేసింది!
రాజు ఆర్య తూరుపు ప్రాంతంలో వెతుక్కుంటూ వెళ్ళింది తప్పక దొరుకుతుంది. నీకు మనశ్శాంతి సిద్ధిస్తుంది.
అవునూ, అది నీకెలా తెలుసు?
రాజులు రహస్యాలను తమలోనే దాచుకోగలిగితే చరిత్ర నిస్తేజంగా సాగుతుంది కదా?
(ఇంకా ఉంది)



# రామాయణం

## యుద్ధ కాండ – 6

రాముడు లంకా ప్రాసాదం సమీపానికి వచ్చి, లోపల ఉన్న సీతను తలుచుకుని, లంకపై దాడి ప్రారంభించమని వానరులకు ఆజ్ఞ ఇచ్చాడు. రావణుడు కూడా రాక్షసులను యుద్ధానికి ఉపక్రమించమని ఆదేశించాడు. సింహనాదాలతోనూ, భేరీ భాంకారాలతోనూ, శంఖు ధ్వానాలతోనూ వానర రాక్షసుల మధ్య యుద్ధం ప్రారంభమయింది.

ఇంద్రజిత్తు అంగదుడితోనూ, జంబుమాలి హనుమంతుడితోనూ, తపనుడనే రాక్షసుడు గజుడితోనూ, నికుంభుడు నీలుడితోనూ ద్వంద్వ యుద్ధాలు చేశారు. ఈ యుద్ధాలలో సంపాతి అనే విభీషణ మంత్రి ప్రజంఘుడనే రాక్షసుణ్ణి చంపాడు. అలాగే ప్రఘునుడు సుగ్రీవుడి చేతిలో చచ్చాడు. విద్యున్మాలిని సుషేణుడనే వానరవీరుడు చంపాడు. ఇంతలో సూర్యుడస్తమించాడు.

ఆ రాత్రి వానరులకూ రాక్షసులకూ ఘోరమైన యుద్ధం జరిగింది. రక్తం నదులుకట్టి పారింది. ఉత్తర ద్వారాన్ని రక్షించే యమశత్రుడూ, మహాపార్శ్వుడూ, మహోదరుడూ, మహాకాయుడూ, వజ్రదంష్ట్రుడూ, శుకసారణులూ రాముడి పైకి యుద్ధానికి వెళ్ళి, తీవ్రమైన రాముడి బాణాలచే కొట్టబడి, పారిపోయి ప్రాణాలు దక్కించుకున్నారు.

అంగదుడికీ, ఇంద్రజిత్తుకూ జరిగిన ద్వంద్వ యుద్ధంలో అంగదుడు ఇంద్రజిత్తు సారథినీ, గుర్రాలనూ చంపాడు. ఇంద్రజిత్తు అంతర్ధానమయ్యాడు. అతను మాయా యుద్ధానికి పూనుకుని, వానరసేనపై పిడుగుల వంటి





బాణాలు వేశాడు, రామలక్ష్మణులిద్దరి పైనా నాగాస్త్రాలు వేసి వారిని బంధించాడు.

అతను వారితో, ''రామ లక్ష్మణులారా, నేను అదృశ్యంగా ఉండి యుద్ధం చేస్తుంటే ఇంద్రుడు కూడా నన్ను తెలుసుకోలేడు, సమీపించలేడు. మీ రెంత? మిమ్మల్ని ఇప్పుడే యముడి వద్దకు పంపేస్తాను,'' అంటూ సింహనాదాలు చేశాడు. రామ లక్ష్మణులు నేలపై పడిపోయి ఏమీ చెయ్యలేని స్థితిలో ఉండిపోయారు.

ఇంద్రజిత్తు రామ లక్ష్మణుల నిద్దరినీ తాను చంపినట్టే భావించుకుని, వారు చచ్చారు చూడమని రాక్షసులకు చెప్పి, లంకలోకి తిరిగి వెళ్ళిపోయాడు.

రామ లక్ష్మణులను చూస్తున్న కొద్దీ సుగ్రీవుడికి భయమూ, దుఃఖమూ పుట్టుకొచ్చాయి. విభీషణుడు సుగ్రీవుడికి ధైర్యం చెప్పి, భయపడి పారిపోయే ప్రయత్నంలో ఉన్న వానరులకు ఉత్సాహం కలిగిస్తూ, సైన్యం నలుదిక్కులా తిరిగాడు.

ఇంద్రజిత్తు తిన్నగా రావణుడి సభకు వెళ్ళి, తండ్రికి నమస్కారం చేసి, ''రామ లక్ష్మణులను చంపేశాను,'' అని చెప్పాడు. రావణుడు పరమ సంతోషంతో అసనం మీది నుంచి లేచి, కొడుకును కౌగిలించుకున్నాడు.

అతను సీతకు కాపలా ఉన్న త్రిజట మొదలైన రాక్షస స్త్రీలను పిలిపించి, ''మన ఇంద్రజిత్తు చేతిలో రామ లక్ష్మణులు చచ్చారు. సీతమదమణిగింది. ఆమె ఇకసర్వాభరణాలూ ధరించి, నా దగ్గరికి వచ్చేస్తుంది. ఆ సీతను పుష్పక విమానంలో ఎక్కించి, యుద్ధరంగానికి తీసుకుపోయి, విగత జీవులై పడి ఉన్న రామలక్ష్మణులను చూపించండి,'' అన్నాడు.

వాళ్ళు పుష్పకం ఉన్న చోటికి వెళ్ళి, దాన్ని తీసుకుని అశోకవనానికి పోయి, అందులో సీత నెక్కించుకుని యుద్ధరంగానికి తీసుకుపోయారు. అక్కడ సీతకు పడి ఉన్న రామ లక్ష్మణులూ, వారి చుట్టూ కూర్చుని, ఏ మాత్రం అలికిడి వినిపించినా రాక్షసులు వచ్చి పడుతున్నారేమో నని భయపడుతున్న వానర ప్రముఖులూ కనిపించారు.

సాముద్రిక వేత్తలూ, జ్యోతిశ్శాస్త్రం తెలిసిన వారూ కూడా తనకు వైధవ్యం ఉండదన్నారు; తాను పుత్రవతి అవుతుందన్నారు, మహారాణి అవుతుందన్నారు. తనకు మహావీరుడు భర్త అవుతాడన్నారు. గోష్పాదమంత ఇంద్రజిత్తు

ఆ మాటలన్నీ అబద్ధం చేసేశాడు. రామ లక్ష్మణులకు తెలిసిన దివ్యాస్త్రాలన్నీ ఏమ య్యాయో? వాళ్ళు తన కోసం నాలుగు దిక్కులా వెతికించి, పెద్ద సేనతో సముద్రాన్ని దాటి లంకను చేరింది ఇంద్రజిత్తు మాయకు బలికావటానికా? పద్నాలుగేళ్లూ పూర్తి కాగానే తన కొడుకు సీతాలక్ష్మణులతో తిరిగివస్తాడని ఎదురు చూసే కౌసల్య ఏంకాను?

ఈ విధంగా దుఃఖంతో కుములుతున్న సీతను చూసి, ''అమ్మా, ఏడవకు. రామ లక్ష్మణులు చావలేదు. వారు చచ్చిన లక్షణా లేవీ కనిపించవు,'' అన్నది త్రిజట. సీత ఆ మాట విని చేతులు జోడించి, ''తథాస్తు!'' అని పలికింది.

పుష్పకం తిరిగి వెళ్ళిపోయాక కొంత సేపటికి రాముడికి స్పృహవచ్చింది. అతను తన పక్కన పడి ఉన్న లక్ష్మణుణ్ణి చూసి అతను చనిపోయాడనుకుని నిరాశచెందాడు. లక్ష్మ ణుడితో బాటు తాను కూడా చావాలని నిశ్చ యించుకున్నాడు. సీత వంటి భార్య వెతికితే దొరక్క పోదు, లక్ష్మణుడి వంటి తమ్ముడెక్కడ దొరుకుతాడు? లక్ష్మణుడు లేకుండా యుద్ధ మెందుకు, అందులో విజయమెందుకు? తాను ఒంటరిగా అయోధ్యకు తిరిగి పోయి సుమిత్ర ఎదటపడ గలడా? అసంభవం!

తాను విభీషణుణ్ణి లంకకు రాజుగా చెయ్యలేక పోయినందుకు రాముడు చాలా చింతించాడు. తన కోసం సుగ్రీవుడు మొదలైన వానర యోధులు పడిన శ్రమకు కృతజ్ఞత చెప్పుకుని, వారు ప్రదర్శించిన శౌర్య పరాక్ర



మాలను మెచ్చుకుని, అందరినీ తిరిగి వెళ్ళి పొమ్మన్నాడు.

ఇంతలో విభీషణుడు తన గదతో సహా సుగ్రీవుడున్న చోటికి వచ్చాడు. అతణ్ణి దూరానే చూసి, ఇంద్రజిత్తు వస్తున్నాడనుకుని వానరులు భయపడి పారిపోసాగారు. జాంబవంతుడు వెళ్ళి వాళ్ళ భయాన్ని పోగొట్టాడు.

సుగ్రీవుడు తన సమీపంలో ఉన్న తన మామ సుషేణుడితో, ''రామ లక్ష్మణులకు స్పృహరాగానే వాళ్ళను తీసుకుని, కొందరు వానర వీరులతో సహా కిష్కింధకు వెళ్ళు, నేను ఈ రావణుణ్ణి చంపి సీతను తీసుకువస్తాను,'' అన్నాడు.

''పూర్వం దేవాసురులకు యుద్ధం జరిగి నప్పుడు అనేక మంది దేవతలు మూర్ఛపో యారు, కొందరు చచ్చిపోయారు కూడా.



అప్పుడు బృహస్పతి మృతసంజీవని లాంటి విద్యలు, మూలికల సహాయంతోనూ వాళ్ళకు చికిత్స చేశాడు. క్షీర సముద్ర మథనం జరిగిన చోట చంద్ర, ద్రోణ పర్వతాలున్నాయి. వాటి పైన దేవతలు సంజీవకరణి, విశల్యకరణి అనే ఓషధులను పెంచారు. హనుమంతుణ్ణి అక్కడికి పంపించి, వాటిని తెప్పించు,'' అన్నాడు సుషేణుడు.

ఇంతలో పెనుగాలి వీచింది. ఆ గాలి తాకిడికి మేఘాలు దూదిపింజెల్లాగా కొట్టుకు పోయాయి, సముద్రంలో పెద్ద కెరటాలు పుట్టాయి. మరి కొంతసేపటికి గరుత్మంతుడక్కడికి వచ్చాడు. అతణ్ణి చూస్తూనే రామ లక్ష్మణులను బాణాల రూపంలో బంధించిన పాములు పారిపోయాయి. తరవాత అతను తన చేతులతో వారిద్దరి ముఖాలూ తడివాడు. వెంటనే వారి గాయాలన్నీ నయమై, శరీరాలకు ఎప్పటి శక్తీ, తేజస్సూ సమకూరాయి.

రాముడు అతనితో, ''అయ్యా, నిన్ను చూస్తే నాకు మా తండ్రినో, తాతనో చూసినంత ఆనందం కలుగుతున్నది. దివ్య లేపనాలూ, దివ్యాంబరాభరణాలూ ధరించి ఉన్నావు. నువ్వెవరు?'' అని అడిగాడు.

''నేను నీకు స్నేహితుణ్ణి. నా పేరు గరుత్మంతుడు. మిమ్మల్ని బంధించిన పాములు కద్రువ సంతానం. ఇంద్రజిత్తు తన మాయ చేత వాటికి బాణ రూపం ఇచ్చి మీపై ప్రయోగించాడు. ఈ వార్త తెలిసి నేనిక్కడికి వచ్చాను. నేను నీకు ఎలా స్నేహితుణ్ణో యుద్ధంలో నీకు జయం కలిగాక చెబుతాను. రాక్షసులు మహా మాయావులు. నువ్వు వారితో జాగ్రత్తగా యుద్ధం చెయ్యి. నీకు జయం కలుగుతుంది,'' అని గరుత్మంతుడు రాముడి వద్ద శలవు తీసుకున్నాడు.

వానరులకు ఉత్సాహం తిరిగి వచ్చింది. వారు భేరులు మోగించి, శంఖాలు పూరించి, సింహనాదాలు చేశారు. లంకలో రావణుడికి ఆ ధ్వని వినిపించింది. రామలక్ష్మణులు చచ్చి, ఏడుస్తూ ఉండవలిసిన వానరులు ఉత్సాహంతో శంఖాలూ, భేరీలూ ఎందుకు మోగిస్తున్నారో కనుక్కురమ్మని అతను కావలి వాళ్ళను పంపాడు. వాళ్ళు ప్రాకారాలపైకెక్కి, వానర సేన అంతా కలయజూసి, రావణుడి దగ్గిరికి వచ్చి, రామ లక్ష్మణులు బంధవిముక్తులై సుఖంగా ఉన్నారనీ, అదే వానరుల యుద్ధోత్సాహానికి కారణం అనీ చెప్పారు.

ఇది విని రావణుడు తెల్లబోయి, ''ఇంద్ర జిత్తు ప్రయోగించిన నాగబంధాలను విప్పటం దేవతలకైనా సాధ్యంకాదు. రామ లక్ష్మణులు వాటి నుంచి బయటపడటం రాక్షస సేనకు అపాయాన్ని సూచిస్తున్నది,'' అన్నాడు. అతను ధూమ్రాక్షు డనే వాణ్ణి పిలిచి, ''సేనతో సహా వెళ్ళి రాముణ్ణివధించిరా!'' అని ఆజ్ఞాపించాడు.

ధూమ్రాక్షుడు ఒక పెద్ద సేన తీసుకుని, తోడేలు ముఖాలూ, సింహం ముఖాలూ గల గాడిదలను పూన్చిన రథ మెక్కి యుద్ధానికి బయలుదేరాడు. రాక్షసులకూ, వానరులకూ గొప్ప యుద్ధం జరిగింది. ఉభయపక్షాలా అపారమైన ప్రాణ నష్టం జరిగింది. చిట్ట చివరకు వానరుల దెబ్బకు తట్టుకోలేక రాక్ష సులు పారిపోసాగారు. ఇది చూసి ధూమ్రా క్షుడు వానర సేనపై విజృంభించాడు. హను మంతుడికి కోపం వచ్చి, పెద్ద శిలను తీసుకు వచ్చి, ధూమ్రాక్షుడి రథంపై వేశాడు. రథం నుగ్గయింది గాని ధూమ్రాక్షుడు గదతో సహా కిందికి దూకేశాడు. హనుమంతుడికీ, అతనికీ యుద్ధమయింది. ధూమ్రాక్షుడు తన గదను హనుమంతుడి తలపైకి విసిరాడు.దాని దెబ్బకు హనుమంతుడు చలించక, ధూమ్రాక్షుడి నెత్తిన పర్వత శిఖరాన్ని వేసి చంపేశాడు.

ధూమ్రాక్షుడు చచ్చాడని విని రావణుడు వజ్రదంష్ట్రుణ్ణి సేనతో సహా పంపాడు. ఆ సేన లంక యొక్క దక్షిణ ద్వారం కుండా వెళ్ళింది. ఆ ద్వారం వద్ద అంగదుడున్నాడు. ఉభయ పక్షాల మధ్యా దొమ్మి యుద్ధం, ద్వంద్వ యుద్ధాలు జరిగాయి.



రామాయణం క్విజ్ ఏప్రిల్ 2009
సరైన సమాధానం: A
విజేతలకు అభినందనలు:
1. షేక్ నజీర్‌బాషా, ఆం.ప్ర.
2. పోపట్ చవాన్, ముంబై
3. కె.ప్రియాంక, తమిళనాడు
4. జయనందన్ దాస్, ఒరిస్సా
5. లూసీ నాజ్రేత్, కర్ణాటక

యుద్ధంలో వానరులు నష్టమవుతూ ఉండటం చూసి మండిపడి, అంగదుడు విజృంభించి రాక్షసుల తలలు పగలగొట్టనారంభించాడు. రాక్షసులా తాకిడికి తట్టుకోలేక చలించిపోయారు. తన పక్షం దెబ్బ తింటూ ఉండటం చూసి వజ్రదంష్ట్రుడు అంగదుడితో తలపడ్డాడు. అంగదుడు కత్తితో వజ్రదంష్ట్రుడి తల తెగవేశాడు.

ఈసారి రావణుడు అకంపను డనే రాక్షస సేనానిని పంపాడు. రాక్షస వానర పక్షాలు రెండూ విజయకాంక్షతో పట్టుదలగా యుద్ధం చేశాయి. కుముదుడూ, నలుడూ, మైందుడూ, ద్వివిదుడూ అనే వానరవీరులు ఒక్కసారిగా రాక్షస సేనపైన పడి రాక్షసులను గుంపులు గుంపులుగా వధించసాగారు. ఇది గమనించి

చందమామ రామాయణం క్విజ్
ఇంద్రజిత్తు ప్రయోగించిన నాగాస్త్రాల బంధం నుంచి రామలక్ష్మణులకు విముక్తి కలిగించిన వీరుడు: a.హనుమంతుడు b.సుశేణుడు c.గరుత్మంతుడు
మీ సమాధానాన్ని CRQ <a/b/c> ఫార్మెట్‌లో 54646కు SMS చెయ్యండి. ఎంపిక చేయబడ్డ ఒక అదృష్ట విజేతకు కామిక్ కాంబో ప్యాక్ అందజేస్తాం.




అకంపనుడు తన రథాన్ని ఆ వానర వీరులున్న చోటికి తోలించాడు. అతని బాణాల తాకిడికి వానర వీరులు తట్టుకోలేకపోయారు.

హనుమంతుడు వానరులకు సాయంగా ఒక కొండను పెరికి, ఒంటి చేత పట్టి గిరగిరా తిప్పి, అంకపనుడి పైకి వేశాడు. అకంపనుడు తన బాణాలతో ఆ కొండ శిఖరాన్ని ముక్కలు చేసేశాడు. హనుమంతుడు మండిపడి, ఒక పెద్ద చెట్టు పెరికి, దానితో అకంపనుడి తల చితకగొట్టి చంపేశాడు.



## మూగవాడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలిస్తున్న కాలంలో మద్రదేశపు రాజు కూతురు చంద్రాదేవి ఆయనకు పట్టపురాణిగా ఉండేది. ఎంత కాలం గడిచినా ఆమెకు సంతానం కలగలేదు. యువరాజు లేనందుకు ప్రజలు విచారించి, రాజు వద్దకు వెళ్ళి పిల్లలు కలగటానికి ఏవైనా వ్రతాలు చెయ్యమన్నారు.

ఆ ప్రకారమే చంద్రాదేవి అనేక వ్రతాలు చేసింది. ఆమె ఒక పౌర్ణమీ పుణ్యదినాన ఉపవాసం ఉండి, ''నేనే శీలవతినైతే నాకు ఒక మగపిల్లవాడు కలగాలి!'' అనుకున్నది.

దేవతలకు రాజైన ఇంద్రుడు ఆమె కోరిక నెరవేర్చటానికి నిశ్చయించి, ఆమె గర్భవాసాన జన్మించగలవాడెవడా అని ఆలోచించేసరికి ఆయనకు బోధిసత్త్వుడు జ్ఞాపకం వచ్చాడు.

బోధిసత్త్వుడు ఒకప్పుడు కాశీరాజుగా జన్మించి, ఇరవై ఏళ్ళు పరిపాలించి, ఆ ఇరవై ఏళ్ళ పరిపాలనలోనూ తాను చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తంగా ఎనభై వేల ఏళ్ళు ఉష్ణద నరకం అనుభవించి, తరవాత దేవలోకంలో ఉండి, అక్కడ తన కాలం తీరిపోగా ఊర్ధ్వ లోకాలకు వెళ్ళిపోవటానికిసిద్ధమవుతున్నాడు.

ఇంద్రుడు ఆ సమయంలో బోధిసత్త్వుడి వద్దకు వెళ్ళి, ''మిత్రమా, నువ్వు వెళ్ళి మానవ లోకంలో జన్మించినట్టయితే ఎంతో పుణ్యం సంపాదించటమే గాక, మానవ కోటిని ఉద్ధరించ గలుగుతావు. కాశీరాజు, ఆయన భార్య చంద్రాదేవి పుత్రుణ్ణి కోరి ఎన్నో వ్రతాలు చేస్తున్నారు. వారి కుమారుడివై జన్మించు!'' అని కోరాడు. అందుకు బోధిసత్త్వుడు సమ్మతించాడు.

బోధిసత్త్వుడు చంద్రాదేవి గర్భంలో ప్రవేశించిన సమయానే అతని అనుచరులైన దేవతలు అయిదువందల మంది కాశీరాజు పరివారంలోని వారి భార్యల గర్భాలలో ప్రవేశించారు.





ఎట్టి ప్రమాదాలూ లేవు. పూర్ణాయువవుతాడు!'' అని చెప్పారు.

తేమియుడు ఒకనెల వయసు గలవాడై ఉండగా, అతన్ని చక్కగా అలంకరించి సభలో ఉన్న రాజుగారి వద్దకు తీసుకువెళ్ళారు. రాజు తన కొడుకును ఒడిలో కూచోబెట్టుకుని ఆడించసాగాడు. ఈ సమయంలో నలుగురు దొంగలను రాజుగారి ఎదుట విచారణకు తెచ్చారు. రాజుగారు నలుగురినీ విచారించి, మొదటి దొంగను వెయ్యి కొరడా దెబ్బలు కొట్టమనీ, రెండవ వాణ్ణి యావజ్జీవం కారాగృహంలో ఉంచమనీ, మూడవ వాణ్ణి ఈటెలతో పొడవమనీ, నాలుగవ వాణ్ణి కొరత వెయ్యమనీ ఉత్తర్వులిచ్చాడు.

సకాలంలో బోధిసత్త్వుడు చంద్రాదేవి గర్భాన అనేక శుభలక్షణాలతో జన్మించాడు. ఆ రోజునే మిగిలిన అయిదు వందల మందీ పుట్టారు. వారందరూ తన కుమారుడితో బాటుగా పెరిగి, అతనికి అనుచరులుగా ఉండాలని రాజు ఉత్తరువిచ్చాడు. తన కుమారుడికి పాలివ్వటానికి అరవైనాలుగు మంది దాదులను ఏర్పాటు చేశాడు. తరవాత ఆయన తన పట్టపురాణి వద్దకు వెళ్ళి ఏదైనా ఒక వరం కోరుకోమన్నాడు. ఆమె సమయం వచ్చినప్పుడు కోరుకుంటానన్నది.

పిల్లవాడికి బారసాల చేసి తేమియుడని పేరు పెట్టుకున్నారు. ఆ సమయంలో రాజు సిద్ధాంతులను, ''పిల్లవాడికి అరిష్టాలేమైనా ఉన్నాయా?'' అని అడిగాడు. వారు లక్షణాలన్నీ పరిశీలించి, ''రాజా, ఈ కుర్రవాడికి

పూర్వజన్మ జ్ఞానం గల బోధిసత్త్వుడు ఇదంతా చూసి, ''అయ్యో, నా తండ్రి రాజు అయిన కారణం చేతగదా నరకాన్ని కోరి తెచ్చుకునే పనులు చేస్తున్నాడు. నేను ఒకప్పుడు ఇరవై ఏళ్ళు రాజుగా ఉన్నందువల్ల ఎనభైవేల ఏళ్ళు ఉష్ణదనరకం అనుభవించాను. మళ్ళీ నేనీ దొంగల వంశంలో జన్మించానేమిటి? తాను దొంగ అన్నది తెలియక నా తండ్రి నలుగురు దొంగలకు అతి క్రూరమైన శిక్షలు విధించాడు. భవిష్యత్తులో నేను కూడా రాజునయ్యానంటే మళ్ళీ నాకు నరకప్రాప్తి తప్పదు!'' అనుకున్నాడు.

అది మొదలు అతనికి ఈ దొంగబతుకు తప్పించుకోవటం ఎలాగా అని విచారం పట్టుకున్నది. అతని బంగారు శరీరం వాడినట్టయిపోయింది. అప్పుడతనికి ఒకనాడు తన

పూర్వజన్మ తాలూకు తల్లి కనిపించి, ''భయపడకు నాయనా, ఈ పాపపు జీవితం నుంచి తప్పించుకోవాలంటే, చెవిటివాడి లాగా, మూగవాడి లాగా, కాళ్ళు లేనివాడి లాగా, మతి లేని వాడి లాగా నటించు!'' అని హెచ్చరించింది. తేమియుడు అలాగే చేయ నిశ్చయించాడు.

రాజుగారి ఆజ్ఞప్రకారం బోధిసత్వుడున్న చోటనే మిగిలిన అయిదువందల మంది పిల్లలనూ ఉంచారు. వారంతా ఆకలి కాగానే పాలకోసం ఏడవసాగారు. కానీ, వారందరిలో బోధిసత్వుడు ఒక్కడే ఏడువలేదు: ''ఆ లోకంలో నరకం అనుభవించటం కన్నా ఆకలికి మాడి చావటం నయం,'' అనుకున్నాడు.

దాదులు వెళ్ళి రాజకుమారుడు పాల కోసం ఏడవటం లేదని రాణితో చెప్పారు. ఆమె ఆ సంగతి రాజుతో అన్నది. రాజు బ్రాహ్మణులను పిలిపించి సలహా అడిగాడు.

''పిల్లవాడు పాల కోసం ఏడవనవసరం లేదు. సరి అయిన వేళకు పాలిస్తే గుటగుటా తాగేస్తాడు,'' అన్నారు బ్రాహ్మణులు. దాదులు అలాగే చేస్తూ వచ్చారు. కాని పరీక్షకు గాను వారు ఒక్కొ0సారి పాలు ఇవ్వటం మానేస్తే పిల్లవాడు ఏడిచేవాడు కాదు. ఇది వారికి ఆశ్చర్యం కలిగించింది. అదీ కాక, మిగిలిన పిల్లల్లా అతను చేతులూ, కాళ్ళూ కదిలించి ఆడుకోలేదు, కేరింతలు కొట్టలేదు. అతని గొంతు నుంచి ఏ చప్పుడూ లేదు. చిటికెలు వేస్తే విననట్టుగా కనబడే వాడు. దీనికి కారణమేమిటో ఎవరూ తెలుసుకోలేకపోయారు.



ఈ విధంగా ఒక ఏడాది గడిచింది. ఒక నాడు దాదులు మిఠాయి తెచ్చి పిల్లలందరి మధ్యా పెట్టి, ''తినండి!'' అని చాటుకు వెళ్ళి ఏం జరుగుతుందో చూడసాగారు. మిగిలిన పిల్లలందరూ ఎగబడి మిఠాయి తిన్నారు. ఒకరి చేతిలోది ఒకరు లాక్కున్నారు. తేమియుడు మాత్రం కొంచెం కూడా ఆసక్తి కనబరచలేదు. ఇది చూసి రాణి గుండె చెరువైపోయింది. ఆమె మిఠాయి తెచ్చి, ''తిను, తండ్రీ!'' అని తన చేత్తో అతని నోట పెట్టింది.

అయిదేళ్ళు గడిచాయి. అయిదేళ్ళు నిండిన పిల్లలకు నిప్పు భయం తెలుస్తుంది. నిప్పు చూసి తేమియుడు భయపడతాడేమో చూస్తామని రాజుగారు పిల్లల కోసం ఒక పెద్ద పాకవేయించి, దానిపైన తాటాకులు వేయించారు. అందులో పిల్లలందర్నీ ఉంచారు.



అతని కాళ్ళలో ఏ లోపమూ లేదు. చెవులూ, నోరూ కూడా ఉండవలసినట్టుగానే ఉన్నాయి. అతను ఎందుకు కదలడో, ఎందుకు మాట్లాడడో, ఎందుకు వినడో ఎవరూ ఊహించలేక పోయారు. పిల్లల వినోదం కోసం నాటకాలాడారు. వినోదం చూసి మిగిలిన పిల్లలందరూ నవ్వారు గాని తేమియుడు నవ్వలేదు. ఒకడు కత్తితో నృత్యం చేస్తూ, ''ఏడీ ఆ రాజకుమారుడు? వాణ్ణి శిరశ్ఛేదం చేస్తాను!'' అంటూ కత్తిచాచి తేమియుడి మీదికి భయంకరంగా వచ్చాడు. మిగిలిన పిల్లలు కెవ్వున అరిచి పారిపోయారు, కాని తేమియుడు కాస్త కూడా చలించలేదు. నృత్యగాడు తన నటన చాలించి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

ఈ విధంగా అతనిలో చైతన్యం కలిగించటానికి ఎన్నో చేశారు. అతని చుట్టూ అకస్మాత్తుగా శంఖాలు ఊదారు; అదేపనిగా డప్పులు వాయించారు; అతని శరీరానికి బెల్లపు నీరు పట్టించి మీద ఈగలు వాలి బాధ పెట్టేటట్టు చేశారు; అనేక రోజులపాటు పళ్ళు తోమక, నీళ్ళు పొయ్యక ఉంచారు; అతని శరీరం నుంచి దుర్గంధం పుట్టింది; అప్పుడు అందరూ అతన్ని హేళన చేస్తూ, ''ఏమిటిది? లేచి వెళ్ళి నీళ్ళు పోసుకోరాదా? శుభ్రంగా ఉండాలన్న జ్ఞానం కూడా లేదూ?'' అన్నారు. ఆఖరుకు అతని మంచం కింద మంటలు పెట్టారు.

ఆ మంటలకు అతని శరీరం బొబ్బలెక్క సాగింది. ''ఆ మంటలకంటే ఈ మంటలే నయం,''అనుకుని తేమియుడుఏమాత్రమూ చలించలేదు.

తరవాత ఆ పాకకు నిప్పు అంటించారు. నిప్పు చూడగానే మిగిలిన అయిదు వందల మంది పిల్లలూ భయపడి పారిపోయారు. తేమియుడు మాత్రం, ''నరకంలో మగ్గటం కన్న ఈ మంటలలో చావటమే నయం,'' అనుకుని నిర్లిప్తుడుగా ఉండిపోయాడు. మంటలు అతనిదాకా వచ్చే సమయానికి అతన్ని ఎవరో ఎత్తుకుని ఇవతలికి రావలిసి వచ్చింది.

తేమియుడు ఏడేళ్ళవాడయ్యాడు. కొన్ని తాచుపాములకు కోరలు పీకేసి, మూతులు కుట్టి పిల్లలందరూ ఉన్న చోట వదిలారు. మిగిలిన పిల్లలందరూ బెదిరి పారిపోయారు గాని, తేమియుడు కూచున్న చోటి నుంచి కదలలేదు. పాములు అతని శరీరం నిండా పాకాయి, అతని నెత్తిన పడగలు విప్పి పట్టాయి. అయినా అతను చలించలేదు.

అతను చలించకపోయినా, లేకలేక కన్న అతని తల్లిదండ్రులు చలించారు. వారి కడుపు తరుక్కుపోయింది. వారీ పరీక్షలన్నీ కట్టిపెట్టించి, కొడుకు వద్దకు వెళ్ళి ప్రాధేయపడ్డారు. ''నాయనా, నీలో ఏ అవలక్షణమూ లేదు, మాకు తెలుసు! ఎన్నో నోములు నోచి నిన్ను కన్నాం. నువ్విలా మన్నుదిన్న పాములాగా పడి ఉండటం మాకు అవమానంగా ఉంది! లేచి మామూలు మనిషిలాగా తిరుగు, నాయనా!'' అని ఎన్నోసార్లు వేడుకున్నారు. అయినా లాభం లేకపోయింది.

తేమియుడికి పదహారేళ్ళు నిండాయి. ''ఎంత కాళ్ళు లేనివాడైనా, మూగవాడైనా, చెవిటివాడైనా, యుక్తవయసు వచ్చాక ప్రేమ అన్నది కలగకుండా ఉండదు. అందుచేత మనవాణ్ణి ఆకర్షించటానికి నాట్యగత్తెలను నియోగిస్తాను. వారందరూ వాడి చుట్టూ ఆడుతూ, నృత్యం చేస్తూ ఉంటే, ఒకతె అయినా వాడి మనస్సును ఆకర్షించవచ్చు. అలా ఆకర్షించినదాన్ని వాడికి పట్టపు రాణిగా చేస్తాను!'' అన్నాడు రాజు.

తేమియుడికి పన్నీట స్నానం చేయించి, మంచి బట్టలు ధరింపజేసి, ఇంద్రభవనం లాంటి భవనంలో-హంసతూలికా తల్పం మీద కూర్చోబెట్టారు. ఆ భవనం నిండా పూలు, అత్తరువులూ, సాంబ్రాణీ, పానీయాలూ అమర్చారు. అక్కడికి అనేక మంది నృత్యం చేసే యువతులు వచ్చారు. వారు తమ ఆటలతోనూ, పాటలతోనూ, రాజకుమారుణ్ణి రంజింపజేయటానికి విశ్వప్రయత్నాలు చేశారు. కాని అతను ఆ నృత్యం చేసే యువతుల గాలి సోకితే ఏమవుతుందోనని ఊపిరి కూడా పీల్చక కొయ్యలాగా అయిపోయాడు.

చివరకా యువతులు ప్రాణం విసిగి రాజు గారి వద్దకు వెళ్ళి, ''మీ కుమారుడు మనిషి కాడు, రాక్షసుడైవుండాలి. మేము నాట్యం చేస్తూ దగ్గిరికి పోతే నిలువునా కొయ్యబారి పోయాడు!'' అని చెప్పారు.

ఈ విధంగా పదహారేళ్ళపాటు సాగించిన ప్రతి పరీక్షా బూడిదలోపోసిన పన్నీరయిపోయింది. తేమియుడి రహస్యమేమిటో ఎవరికీ తెలియలేదు. *-[ముగింపు వచ్చే సంచికలో]*





# ఇరాక్ జానపద కథ

## మహిమగల నశ్యం

ఒకానొకప్పుడు సంపన్నమైన బాగ్దాద్ మహానగ రాన్ని వివేకవంతుడైన ఖలీఫా పరిపాలించేవాడు. విశ్వాసపాత్రుడైన వజీరుతో కలిసి ఖలీఫా తరచూ మారువేషంలో సంచరిస్తూ పరిస్థితులను ప్రత్యక్షంగా చూసి తెలుసుకుని తగిన చర్యలు చేపట్టేవాడు.

అలా ఖలీఫా, వజీరు ఒకసారి మారువేషాల్లో నగర వీధుల్లో సంచరిస్తూండగా ఒక వృద్ధుడు వాళ్ళను సమీపించి, అందమైన ఒక నశ్యం డబ్బీని చూపాడు. ''సునిశితమైన నగిషీ పనులతో ఉన్న అద్భుత మైన ఈ నశ్యం డబ్బీని కేవలం ఒక్క బంగారు



నాణేనికే ఇస్తాను,'' అన్నాడతడు. ఖలీఫా రెండు బంగారు నాణేలిచ్చి దానిని కొనుక్కున్నాడు.

మరి కొంతసేపటికి ఖలీఫా, వజీరు ఒక కొలను గట్టున కూర్చున్నారు. ఖలీఫా, ''ఇందులో నశ్యం ఉందేమో చూద్దాం,'' అంటూ నశ్యం డబ్బీని తెరిచి చూసి, ''ఏమిటీ?'' అని ఆశ్చర్యపోయాడు. వజీరు ఏముందోనని మెడ ముందుకు సాచి దాన్ని పరిశీల నగా చూశాడు. అందులో నశ్యంతో పాటు ఒక పత్రం కూడా కనిపించింది. అందులో ''చిటికెడు నశ్యం పీలిస్తే ఎగిరే రెక్కలు! మళ్ళీ చేతులు కావాలా? కసాలవాయిర్!'' అని రాసి ఉంది!

''ఇది మహత్తుగల నశ్యం! కొంచెం పీల్చి ఆకా శంలో విహరించి వద్దాం వజీర్,'' అన్నాడు ఖలీఫా ఉత్సాహంగా.

''ఒకవేళ ఆ మంత్రం పనిచేయలేదంటే,'' అంటూ వజీరు అనుమానం వ్యక్తం చేశాడు.

అయితే, సాహసప్రియుడైన ఖలీఫా, ''ప్రతిదాన్నీ అనుమానించకూడదు. ఆ సమస్యను అప్పుడు చూసుకుందాం,'' అంటూ వజీరుతో కలిసి కొద్దిగా నశ్యం పీల్చాడు. మరు క్షణమే ఇద్దరూ కొంగలుగా మారి ఆకాశానికి ఎగిరి నగరమంతా కలయతిరిగారు. సాయంకాలమయ్యేసరికి మానవరూపాలు పొంది రాజభవనానికి తిరిగి పోవాలనుకున్నారు. ఖలీఫా గొంతెత్తి, ''కసాలవాయిర్!'' అని చెప్పాడు. వాళ్ళ రూపాలలో ఎలాంటి మార్పూ రాలేదు. ఖలీఫా మళ్ళీ, ''కసాలవాయిర్!'' అన్నాడు. అయినా ఏమీ జరగలేదు. ఖలీఫా విచారంతో వజీరు కేసి చూశాడు. ''నేను అప్పుడే చెప్పాను కదా!'' అన బోయి ఆగి రాజాజ్ఞ కదా అనుకుని, ''కసాలవాయిర్!

కూలవాయిర్!'' అని అలిసిపోయేదాకా అరిచాడు. అయినా ఎలాంటి ఫలితమూ కనిపించలేదు.

''మన శత్రువెవరో దీనిని మన మీద ప్రయోగించి నట్టుంది, సందేహం లేదు,'' అన్నాడు వజీరు. ఆకలెత్తడంతో మంచి భోజనం చెయ్యాలనుకున్నారు గాని కొంగల రూపాలలో ఉన్నారు గనక, కొలనులో దొరికిన చేపలు, నత్తలు, కప్పలు మొదలైన వాటి తోనే సరిపెట్టుకోక తప్పలేదు!

మరునాడు తెల్లవారగానే రెండు కొంగలూ రాజ భవనం వద్దకు వెళ్ళాయి. కొన్ని వాహనాలు రాజ భవనం కేసి వస్తూ కనిపించాయి. వాటి ముందు ఖలీఫా తమ్ముడు ఉమర్ ఉన్నాడు. చాలా కాలంగా సింహాసనాన్ని ఆక్రమించాలని అతడు కుట్రపన్ను తూండడం ఖలీఫాకు జ్ఞాపకం వచ్చింది. ఖలీఫా, ''ద్వారాలు తెరవకండి! వాణ్ణి లోపలికి రానివ్వ కండి!'' అని అరిచాడుగాని, అవి కొంగ నోటి నుంచి కీచు కీచు మనే అరుపులుగా మాత్రమే వినిపించాయి. ''ఆహా, కొంగలు సైతం నాకు స్వాగతం పలుకు తున్నాయి!'' అంటూ గట్టిగా నవ్వాడు ఉమర్.

కొంగరూపంలోని ఖలీఫా ఏమీ చేయలేక మౌనంగా ఉండిపోయాడు. ''రండి, ప్రభూ! దూరంగా వెళ్ళి ఈ సంకటస్థితి నుంచి బయటపడే మార్గం ఆలోచిద్దాం,'' అన్నాడు వజీరు వినయంగా.

రెండు కొంగలూ ఎగిరివెళ్ళి అడవిని చేరాయి. అక్కడొక వడ్రంగిపిట్ట ఏడుస్తూండడం గమనించి కొంగలు దాని దుఃఖకారణం ఏమిటని అడిగాయి. ''నాదో విషాదగాథ... నిజానికి నేనొక యువరాణిని. పరమదుర్మార్గుడైన ఖాదర్ అనే మాంత్రికుడు నన్ను ఇలా వడ్రంగిపిట్టగా మార్చేశాడు. నన్ను పెళ్ళాడమని మనిషి ఎవరైనా అడిగితే తప్ప నాకీ రూపం నుంచి విముక్తి లేదు,'' అంటూ తన గోడు వెళ్ళబోసుకున్నది వడ్రంగిపిట్ట.

ఖలీఫా కొన్ని క్షణాలు ఆలోచించి, ''ఆ మాంత్రి



కుడి గురించిన వివరాలు నీకేమైనా తెలుసా?'' అని అడిగాడు.

''ఇక్కడికి సమీపంలోని సమతల ప్రదేశంలో వాడు మరికొందరు మాంత్రికులతో తరచూ రహస్య సమావేశం జరుపుతాడన్న విషయం మాత్రమే తెలుసు,'' అన్నది వడ్రంగిపిట్ట.

వెంటనే రెండు కొంగలూ ఎగిరివెళ్ళి సమతల ప్రదేశం చేరుకుని ఒక పొద చాటున నక్కి కూర్చు న్నాయి. చంద్రోదయం కాగానే, ముగ్గురు మాంత్రి కులు అక్కడికి వచ్చి అగ్ని రగిలించారు. అగ్ని జ్వాలలు ఎగిసి పడుతూండగా మరో మాంత్రికుడు అక్కడికి రాగానే, తక్కిన ముగ్గురూ వంగి సలాం చేస్తూ, ''మహామాంత్రికులు ఖాదర్‌కు అభివా దాలు!'' అన్నారు.

తనకు నశ్యం డబ్బీని అంటగట్టిన వ్యక్తి ఖాదర్ అని గ్రహించడంతో ఖలీఫా ఆశ్చర్యపోయాడు. మరికొంతసేపటికి తన సోదరుడు ఉమర్ విజయ



దరహాసంతో అక్కడికి రావడం చూసి ఖలీఫా మరింత ఆశ్చర్యానికి లోనయ్యాడు. అతడు నాణేలు నిండిన పట్టుసంచీని మాంత్రికుడికి అందించి, ''శభాష్! బహు చక్కగా చేశావ్ ఖాదర్! మా అన్నయ్య అడ్డు ఎలా తొలగించావు?'' అని అడిగాడు ఉమర్.

''అది చాలా సులభం ప్రభూ! ఆయనకో నశ్యం డబ్బీని అమ్మాను. మంత్రంలో ఒకే ఒక్క అక్షరం మార్చివేశాను. ఇక మీ అన్నకు విముక్తి అంటూ ఉండదు. పత్రంలో 'కలాసవాయిర్' అనడానికి బదులు 'కసాలవాయిర్' అని రాశాను. అంతే!'' అన్నాడు గర్వంగా.

మరుక్షణమే రెండు కొంగలూ ఉమర్, ఖాదర్‌ల మీద ముక్కుతో, గోళ్ళతో రక్కుతూ దాడి చేశాయి.

''పరిగెత్తండి! వాళ్ళే వచ్చినట్టుంది!'' అని అరుస్తూ ఖాదర్ వాటి బారి నుంచి తప్పించుకుని పారిపోయాడు. కొంగలు రెండూ ఎగిరివెళ్ళి వడ్రంగి పిట్ట ఉన్న చెట్టు దగ్గర వాలాయి. కొంగ రూపంలోని ఖలీఫా, ''కలాసవాయిర్!'' అని మూడుసార్లు చెప్పడంతో ఇద్దరికీ మునుపటి మానవరూపాలు వచ్చేశాయి.

ఆశ్చర్యంతో చూస్తున్న వడ్రంగిపిట్టతో ఖలీఫా, ''యువరాణీ, నీకు సమ్మతమైతే నన్ను వివాహమాడి గౌరవించు!'' అన్నాడు.

మరుక్షణమే వడ్రంగి పిట్ట అందాల యువ రాణిగా మారిపోయింది. తనలాగే కొన్ని రోజులు పక్షి జీవితం గడిపిన ఖలీఫాతో చక్కని జోడు కుదిరింది కదా అని యువరాణి మనసు ఆనందంతో ఉప్పొంగింది.

మరునాడు తెల్లవారగానే సమీప గ్రామంలో గుర్రాలను తీసుకుని ఖలీఫా, వజీరు బాగ్దాద్ చేరారు. తమ ప్రియతమ పాలకుడికి నగర ప్రజలు ఆనందోత్సాహాలతో స్వాగతం పలికారు. ఖలీఫా రాజభవనాన్ని సమీపించి ఎదురుపడ్డ ఉమర్‌ను చూడగానే, ''ఆ దుర్మార్గుణ్ణి పట్టి బంధించండి,'' అని భటులను ఆజ్ఞాపించాడు.

''అన్నయ్యా, క్షమించు! ప్రాణభిక్ష పెట్టు,'' అంటూ ప్రాధేయపడ్డాడు ఉమర్.

''నువ్వు చేసిన ద్రోహానికి శిరచ్ఛేదమే తగిన శిక్ష. అయినా తోబుట్టువుకదా అని రాజ్య బహిష్కారం విధిస్తున్నాను. భూమి చివరకు నిన్ను ఓడలో తీసుకువెళ్ళి వదలమంటాను. దారి పొడవునా నీకు కప్పలు, నత్తలు, పీతలు మాత్రమే ఆహారం!'' అన్నాడు ఖలీఫా గంభీరంగా.

ఆ తరవాత ఖలీఫా యువరాణిని పెళ్ళాడి, వజీరు సలహాలు తీసుకుంటూ చిరకాలం చక్కని పాలన జరిపాడు. మునుపటి కన్నా ఖలీఫా ఇప్పుడు ప్రజల బాగోగులను ఎప్పటికప్పుడు తెలుసుకుని వాటికి సత్వర పరిష్కారాలు సూచించడం ప్రజలకు ఆశ్చర్యానందాలు కలిగించాయి. మధ్యాహ్నానికి పైన రోజూ రెండు కొంగలు ఆకాశంలో తిరగడం వాళ్ళెప్పుడూ గమనించలేదు!

# సొంతంగా మీ బుల్లి సుడిగుండం!




ఇంటి దగ్గరే సీసాలో సుడిగుండం తయారు చేసుకునే పద్ధతి ఇక్కడ చూడండి!

ఏ మేం కావాలి? బిరడాలతో రెండు పారదర్శకమైన ప్లాస్టిక్ సాఫ్ట్ డ్రింక్ బాటిల్స్, డక్ట్ టేప్, దృఢమైన జిగురు, కత్తెర లేదా మేకు, నీళ్ళు, ఫుడ్ కలరింగ్.

తయారు చేయడం ఎలా?

- ప్లాస్టిక్ సీసాల బిరడాలను తీయండి. రెండు బిరడాల పైభాగాలను దృఢమైన జిగురుతో ఒకటిగా గట్టిగా అతికించండి.
- బిరడాలు కదలకుండా పక్కల్లో డక్ట్ టేప్ మరింత గట్టిగా చుట్టండి.
- అతికించిన బిరడా మధ్య కత్తెర లేదా మేకుతో (పెద్దల పర్యవేక్షణలో) చిన్న రంధ్రం చెయ్యండి. చేసే రంధ్రం స్ట్రా రంధ్రం చుట్టుకొలత కన్నా కాస్త పెద్దదిగా ఉండాలి.
- ఒక సీసాను నీళ్ళతో నింపండి. ఫుడ్ కలరింగ్ కలిపితే నీళ్ళు రంగుగా మారుతాయి. దీనివల్ల నీటి కదలికను సులభంగా గుర్తించవచ్చు. సుడిగుండం రంగురంగులుగా కనిపిస్తుంది.
- నీళ్ళతో ఉన్న సీసాకు బిరడాను బిగించండి. ఖాళీ సీసాను పై బిరడాకు బిగించండి.
- సీసా బిరడాల నుంచి నీళ్ళు బయటకు రాకుండా జాగ్రత్తలు తీసుకోండి.
- ఇప్పుడు సీసాలను తల్లకిందులుగా తిప్పండి.
- నీళ్ళున్న సీసాను బాగా కదిపారంటే నీళ్ళు సుడులు సుడులుగా తిరుగుతాయి.
- సీసాను తల్లకిందులు చేశారంటే నీళ్ళు సుడులు తిరుగుతూ కిందికి దిగుతాయి.



కాన్సెప్ట్: నీళ్ళు తిరిగినప్పుడు సుడిగుండం ఏర్పడుతుంది. నీళ్ళు వృత్తాకారంలో సుడులు తిరిగేప్పుడు దానిమీద 'సెంట్రీ పేటల్ ఫోర్స్' పనిచేస్తుంది. ఈ శక్తి నీళ్ళను కేంద్రబిందువు కేసి లాగుతుంది. కేంద్రబిందువుకు దగ్గరగా ఉండడం వల్ల సన్నగా ఉన్న సుడిగుండం వద్ద ఉన్న నీళ్ళు, పైనున్న నీళ్ళకన్నా వేగంగా పరిభ్రమిస్తాయి. ఖాళీ సీసాలోని గాలి పైకి రావడానికి రంధ్రం ఉపయోగపడుతుంది గనక, నీళ్ళు కింద పడడానికి చోటును ఏర్పరుస్తుంది.

# వేగ సూత్రం



ఈ నెల సమస్య:

స్నేహ, ఆమె మిత్రులు వాళ్ళ అపార్ట్‌మెంట్ బ్లాకులో రిపబ్లిక్ దినోత్సవ సందర్భంగా పిల్లలతో ఒక నాటకం ప్రదర్శించాలనుకున్నారు. ఆ బ్లాక్‌లో 10ఫ్లాట్స్ ఉన్నాయి. ఒక ఫ్లాట్ ఖాళీగా ఉన్నది. స్నేహ, రమేష్ ఫ్లాట్స్‌లో తప్ప మిగిలిన ఒక్కొక్క ఫ్లాట్‌లో ఒక్కొక్క బిడ్డ ఉంటోంది. స్నేహకూ, రమేష్‌కూ ఒక్కొక్క తమ్ముడు ఉన్నారు. అపార్ట్‌మెంట్ బ్లాకులోని పిల్లలందరూ నాటకంలో పాల్గొనాలి. ఒక బిడ్డకు దుస్తుల అద్దె 70రూ.లు, మేకప్ కిట్ కొనడానికి ఒక్కొక్క బిడ్డ 25రూ.లు పెట్టాలి. ఒక్కో బిడ్డకు జెండా 3రూ.లు. ఈ నాటకం ప్రదర్శించడానికి మొత్తం ఎంత డబ్బు కావాలి? దీనిని లెక్కగట్టడానికి వేగవంతమైన మార్గం ఏది?

మీ వేగసూత్రాన్ని మాకు పంపండి.

అత్యంత వేగవంతమైన సూత్రానికి బహుమతి రూ.500/-

మీ ఎంట్రీలను పంపవలసిన చిరునామా:

ఎడిటర్, చందమామ ఇండియా లిమిటెడ్, 2/513, సందీప్ అవెన్యూ ఈస్ట్, సెకండ్ మెయిన్ రోడ్, చిన్న నీలాంగరై, చెన్నయ్-600041.

లేదా contests@chandamama.com కు ఈ మెయిల్ చేయండి.

*గమనిక: ఈ సమస్యకు వేగవంతమైన వేదగణిత సూత్రం ఆగస్టు సంచికలో ప్రచురించబడుతుంది.*

---

ఏప్రిల్ నెలలో మేమడిగిన సమస్యకు సరైన వేగ సూత్రం రాలేదు. ఇదీ సరైన సమాధానం:

మొత్తం జంతువుల సంఖ్య : 63+23=86

మొత్తం రోజులు : 30+31+30=91

ఒక రోజుకు ఒక జంతువు మేతకు అయ్యే ఖర్చు =రూ.10.

∴ ఖర్చు మొత్తం=86X91X10

కింది స్టెప్స్ దగ్గరి మార్గాన్ని సూచిస్తాయి:

స్టెప్ 1: సంఖ్యలకూ 100కూ ఉన్న తేడాను కనుగొనండి:

100-91=9; 100-86=14

స్టెప్ 2: సంఖ్యలను కింది ఫార్మెట్‌లో రాసుకోండి:

a)86, b)14, c)91, d)9

స్టెప్ 3: ఇప్పుడు 86 నుంచి 9 తీసివేయాలి(a-b).

86-9=77

14ను 9తో గుణించుకోవాలి(bxd).

14X9=126

ఎడమవైపు ఉన్న 1ని 77తో కలిపి మీ సమాధానంలో ఎడమవైపు రాసుకోండి. మీ సమాధానం 7826, అంటే 86X91 చేయగా వచ్చే జవాబు అన్నమాట. ఇప్పుడు దానికి సున్నా కలిపితే చివరి సమాధానం వస్తుంది.(7826X10) రూ.78260లు.

# చందమామ లోకజ్ఞానం క్విజ్-5

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

**Co-sponsored by Infosys FOUNDATION, Bangalore**

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి

**రూ. 250లు.***

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువ మంది ఉన్నట్టయితే ఒక్కొక్క విజేతకు **50 రూ.లు** బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయవలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు( 16 ఏళ్ళలోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ - 5 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. జూన్ నెలాఖరులోగా మీ ఎంట్రీ మాకు అందాలి.
6. ఆగస్టు నెల సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## కార్ల గురించి తెలుసుకుందాం!



1. మొట్టమొదటి ఆటోమొబైల్ ఏ సంవత్సరం కనుగొనబడింది? ఎక్కడ?
2. ఇటాలియన్ కారు మిలిసెంటో స్ఫూర్తితో రూపొందించబడిన ఇండియన్ కారు ఏది?
3. భారతదేశంలో తయారు చేయబడిన మొట్టమొదటి కారు ఏది?
4. ఏ భారతీయ కారు కంపెనీ మొట్టమొదట ఐదు లక్షల కార్లను ఎగుమతి చేసింది?
5. వేలంపాటలో అత్యధిక ధరకు అమ్మబడిన కారు ఏది?
6. ప్రపంచంలోకెల్లా అత్యంత వేగంగా నడిచే కారు ఏది?
7. సోలార్ కార్ రేసింగ్‌కు మార్గదర్శకులుగా ఇద్దరిని చెబుతారు. వారిపేర్లేమిటి?
8. ప్రపంచంలోకెల్లా అతి చౌకగా లభించే కారును తయారు చేయనున్న సంస్థ ఏది?

**డుర్రర్రర్ డుర్రర్రర్...**

ఇంటర్వ్యూ జరుగుతోంది.

ఆఫీసర్: ఎలెక్ట్రిక్ మోటార్ ఎలా నడుస్తుంది?

చింటూ: డుర్రర్రర్ ర్ ర్ ర్ ర్ ర్ ర్ ర్...

ఆఫీసర్: ఆవు, దాన్ని ఆవు

చింటూ: డుర్రర్రర్ డుర్రర్రర్... డుప్.. డుప్.. డుప్..?



మరిన్ని జోక్స్ కోసం **telugu.chandamama.com** జోక్స్ విభాగం చూడండి

సైబర్‌నెట్‌లో 15 లక్షల బ్లాక్ హోల్స్? వివరాలకు telugu.chandamama.com చూడండి

# ఫోటో వ్యాఖ్యల పోటీ

ఈ ఫోటోలకు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.



K.S. GANAPATHI RAMAN

BODAPATI KRISHNAVENI





వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి.
పోటీ ఫలితాలు ఆగస్టు 2009 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.
ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ ఇండియా లిమిటెడ్,
**2/513, సందీప్ అవెన్యూ ఈస్ట్, సెకండ్ మెయిన్ రోడ్, చిన్న నీలాంగరై, చెన్నయ్ - 600 041**

## అభినందనలు

తాండ్ర దుర్గాప్రసాద్,
నెం. 8-11-105,
కొండూరువారి వీధి,
వరంగల్-506002,
ఆంధ్రప్రదేశ్.

ఫోటో వ్యాఖ్యల పోటీ:





చూసేవారికి వినోదం!
ఎక్కేవారికి సంబరం!!

## చందమామ లోకజ్ఞానం క్విజ్-3 ఏప్రిల్ 2009 సమాధానాలు

1. మాగెల్లాన్; 1519లో 2. ఇరాక్ 3. బ్రిటన్ విక్టోరియా రాణి; 63సం.ల216 రోజులు 4. 19 ఏళ్ళు మాత్రమే; 1431 5. ది గెస్టాపో 6. జార్జ్ వాషింగ్టన్; 1789లో తొలి అధ్యక్షుడయ్యాడు.

ఆర్య, గరుడ, వంటి వీరుల కథలను telugu.chandamama.com లో చూడండి



# అనునిర్వ

## తదనంతరం

**నా** ఎదుట కూర్చున్న పాపాయికి పట్టుమని ఐదేళ్ళుండవు. అయినా జీవితంలో ఢక్కాముక్కీలు తిన్న వ్యక్తిలా కనిపిస్తోంది. చాలీచాలని బిగువైన గౌను వేసుకుని దాంట్లో ఇమడలేక తెగ అవస్థ పడుతున్నట్టున్నది. పక్కనే కూర్చున్న ఆమె అక్కయ్యకు పదేళ్ళుంటాయి. పుల్లటి నిమ్మతొనను చప్పరిస్తున్నట్టు పెదవులు బిగబట్టి కూర్చుంది. పక్క సీట్లన్నీ ఖాళీగా ఉన్నాయి.

నేను నా జీవితంలో ఒంటరిగా చేస్తున్న మొట్టమొదటి రైలు ప్రయాణం ఇది. పది నిమిషాలకోసారి ఏం చేస్తున్నావని అడిగే పెద్దలు లేరు. రైలులో అమ్మడానికి వచ్చే తినుబండారాలను ఒక్కటీ వదిలిపెట్టకూడదు. పదిహేనేళ్ళ కుర్రాడిని కదా! వేరుశనక్కాయలు, సమోసాలు ఒకటేమిటి? ఏవి కావాలంటే అవి హాయిగా కొనుక్కుని తినాలి!



చిప్స్ పాకెట్ తీసి తినడం మొదలుపెట్టాను. పెద్దమ్మాయి కాస్త ఆసక్తి చూపుతున్నట్టనిపించింది. ''కావాలా?'' అని అడిగాను.

''వద్దు,'' అందామె.

''ఎక్కడ దిగుతారేంటి?'' అని అడిగాను.

''తెలియదు.''

''మీ చెల్లెలెందుకు అంత దిగాలుగా ఉంటోంది?''

''ఆమెనే అడుగు.''

నేను ఆ పాపాయికేసి తిరిగి వీలైనంత చిన్న పాపాయి గొంతును అనుకరిస్తూ, ''చిప్స్ కావాలా?'' అని అడిగాను. ఆమె ముఖం మరింత బిగ్రబిగుసుకు పోయిందే తప్ప అసలు నా వైపు చూడనైనా లేదు.

''మీ తల్లిదండ్రులెక్కడ?'' అని అడిగాను.

''ఇక్కడ లేరు,'' అన్నది మిస్ లెమన్.

''మీ చెల్లెలు ఓమెన్‌లో నటించొచ్చు. పాత్రకు సరిగ్గా సరిపోతుంది,'' అన్నాన్నేను నవ్వుతూ.

లెమన్, ఓమెన్ ఇద్దరూ నన్ను కొరకొరా చూడ్డంతో ఇక వాళ్ళ జోలికి పోకూడదనుకున్నాను. గాఢంగా నిట్టూర్చి నాతో తెచ్చుకున్న 'హ్యారీపాటర్' పుస్తకంలో మునిగిపోయాను. ఈ పుస్తకం నేను వెయ్యిసార్లు చదివాను. అయినా

కొన్ని భాగాలు మళ్ళీ మళ్ళీ చదవాలనిపిస్తాయి. ముఖ్యంగా క్విడ్డిట్చ్ గురించిన అధ్యాయాలు.

లెమన్ కళ్ళు పుస్తకం అట్టను పరిశీలి స్తున్నట్టు గమనించాను గాని, దాన్ని నేన సలు పట్టించుకోలేదు.



''హ్యారీపాటర్ చదువుతున్నావా?'' అని అడిగిందామె కాస్త కోపం నిండిన కంఠస్వరంతో.

''అవును. నీకు మాట్లాడ్డం కూడా వచ్చా? చాలా సంతోషం!''

''హ్యారీపాటర్ పుస్తకంలో అంత గొప్ప ఏముంది?'' అని అడిగిందా అమ్మాయి.

''నువ్వు దాన్ని చదివావా?''

''సగం చదివాను. అప్పటికే విసుగనిపిం చింది. కొత్తేమీ లేదు,'' అందామె.

''విసుగా? బహుశా కథ నీకు అర్థమై ఉండదు. అది చాలా పెద్దది. పిల్లలు ఆ విష యాలన్నీ అర్థం చేసుకోవడం కష్టమనుకుం టాను...''

''నా వయసు మూడువందలా నలభైరెండు సంవత్సరాలు, తెలుసుకో,'' అందామె కీచు మనే కంఠస్వరంతో.

ఆ మాటకు ఉలిక్కి పడ్డాను. నోరు వెళ్ళ బెట్టాను. ఈ పిల్ల పిచ్చిదై ఉంటుందనుకున్నాను. ''నీకు పదేళ్ళుంటాయి. అర్థం పర్థం లేని అబ ద్ధాలు ఆపు!'' అన్నాను.

''నాయనా, నా వయసు మూడువందలా నలభైరెండు సంవత్సరాలు. అది నా భర్త. ఆయన వయసు మూడువందలా ఇరవై యేడేళ్ళు,'' అని చెప్పిందామె ఓమెన్‌కేసి చేయి చూపుతూ.

''మరి మీ భర్త ఎందుకు గౌను వేసుకు న్నాడు?'' అని రెట్టించాను.

''వేసుకోవలసిన నిర్బంధం. టైమ్ లేదు. ఓడ బయలుదేరుతోంది. అక్కడికి చేరుకోవాలంటే ఆ సమయానికి అందుబాటులో ఉన్న డ్రస్ అదొక్కటే!'' అందామె.

''అందుకేనా ఆయనగారు మరీ అంత కోపంగా ఉన్నాడు? ఇప్పుడు కదా అర్థమ యింది,'' అంటూ నవ్వాన్నేను.

అయినా ఆమె మాత్రం అతీతమైన ఊహ లతో నన్ను వినోదపరచడానికి ఉపక్రమిస్తోంది.

''సరే, మీరిద్దరూ ఇప్పుడు ఎక్కడికి వెళు తున్నట్టు?''

''ఇంటికే. తెల్లవారేసరికి చేరుకుంటాం,'' అందామె.

''మీరెక్కడ ఉంటున్నారు?'' అని అడిగాను ఆత్రుతగా.

''అనునిర్వ - అంతరించిపోయిన ప్రాణుల భూమిలో,'' అందామె.

నేను బిగ్గరగా నవ్వి, ''మీరు మామూలు

మనుషులు కారు. మరి, అంతరించిపోయిన మహానుభావులు. ఇప్పుడు నా ఎదుట ఎలా కూర్చుని ఉన్నారు?'' అని అడిగాను.

''మేము మానవులకు అంతరించిపోయాం; ఆ 'ఒక్కరి'కి కాదు. మమ్మల్ని మానవ రూపాలతో మీరు చూడలేనంత మాత్రాన మేము సజీవంగా లేమని అర్థం కాదు కదా!''

''మరి ఏ రకమైన అంతరించిపోయిన ప్రాణి నువ్వు? డైనోజారు కాదు కదా?''

''డైనోజార్లు కంపు కొడతాయి. నేను డోడో!'' అన్నది లెమన్ చాలా గొప్పగా.

''డోడోల్లా మరణించిన వారా?'' అన్నాను మనసులో గొణుక్కుంటున్నట్టు.

''ఆ వెటకారపు ఉపమానమే వద్దంటున్నాను,'' అందామె.

''సరే, మిస్టర్ డోడో ఎందుకు మాట్లాడ్డం లేదు? పన్ను నొప్పా? మరింకేమైనా బాధా?''

''డోడోలకు పళ్ళుండవు నాయనా!'' అన్నది ఓమెన్ స్పష్టమైన మగగొంతుకతో.

దిగ్భ్రాంతి చెందాను. అంత వరకు లెమన్ కాస్త పిచ్చిదైనా మంచి ఊహాశక్తి గల అమ్మాయి అనుకున్నాను. అయితే, ఇప్పుడు ఏ ఒక్కటీ అంతుబట్టడం లేదు!

నా ముఖ కవళికలను పసిగట్టగానే ఓమెన్ ముఖంలో నవ్వు చిగురించింది. ''నీకు ఆశ్చర్యంగా ఉంది కదూ? మామూలుగా వర్తమానంలోని మనుషులతో మేము మాట్లాడం. అయితే కాచుక్కూచోవడం విసుగనిపించింది...''




''అది మంచి ఆలోచన అని రూఢిగా చెప్పలేను...'' అంటూ లెమన్ ఏదో చెప్పడం ప్రారంభించడంతో, రైలు ప్లాట్‌ఫారం వదిలి కదిలింది. ''ఫరవా లేదులే. కుర్రాడు ఆసక్తి చూపుతున్నాడు.. నాకూ చెప్పాలనే ఉంది,'' అన్నాడు ఓమెన్.



ఎలాంటి అభ్యంతరం చెప్పకుండా అతడు చెప్పేవి వినాలనుకున్నాను.

''అనునిర్వ అంతరించిపోయిన ప్రాణుల రూపాలన్నీ చేరుకునే భూమి. మేము వర్త మానం నుంచి భూతకాలానికి వెళ్ళిపోతాం. అయితే, భూతకాలం అన్నది మీరు విశ్వ సించేట్టు మరణించినది కాదు.''

''వర్తమానంలో బతకడానికి చోటూ, ఆహారం లభించనప్పుడు ఆ ప్రాణులు అందరికీ అన్నివేళలా కావలసినంత లభించే భూతకాలంలోకి చేరుకుంటాయి,'' అంటూ దగ్గిన అతడు మళ్ళీ, ''ఒక్కొక్కసారి, ప్రాణులు క్రమక్రమంగా అక్కడికి చేరుకుంటాయి నాలాగా. కొందరు పోర్చుగీసులకు ఆకలి కావ డంతో, ఈమె భూతకాలంలోకి చేరుకున్నది. నేను 1681లో చేరాను. నేనే అలా వచ్చిన చిట్ట చివరి డోడోను,'' అని ఆగాడు.

''కొన్ని సందర్భాల్లో కొన్ని ప్రాణుల గుంపులు ఒక్కసారిగా చేరుతూంటాయి. డైనోజార్లు అలాగే వచ్చిపడ్డాయి. ఏం జరిగిందో, ఎలాంటి దెబ్బకు వచ్చిపడ్డామన్న విషయాలు వాటికే తెలియవు?'' అన్నది లెమన్.

''మరణించిన ప్రాణులన్నీ గతంలోకి కొట్టు కుపోకుండా అక్కడికెందుకు వస్తాయన్నదే అర్థంకాలేదు,'' అని అడిగాన్నేను.

''ఎందుకంటే మరణం అన్నది అంతరించి పోవడం కన్నా భిన్నమైనది. వర్తమానంలో మరీ మరీ తక్కువ మందే మిగిలి ఉన్నారు. అందువల్ల మళ్ళీ జీవించడానికి ప్రయత్నించడంలో అర్థం లేదు గనక, మేము చనిపోయిన వాటి నుంచి తిరిగి రాలేకుండా ఉండి పోతున్నాం,'' అని వివరించింది ఓమెన్.

''అక్కడ మీరు ఎంత మంది... ఎంత మంది ఉన్నారేంటి?'' అని అడిగాను నేను.

''లెక్కకు మిక్కిలిగా ఉన్నాం. ఇరవై ఒకటవ శతాబ్దంలో ఇప్పటికే ఎనిమిది ప్రాణులు ప్రవే శించాయి! గోల్డన్ టోడ్, బయిజీ డాల్ఫిన్, సైరీనియన్ ఐబెక్స్...'' అంటూ ఓమెన్ ఒక్కొక్క వేలు విడుస్తూ లెక్కించాడు. ''మరయితే మీరిప్పుడు రైలులో ఏం చేస్తున్నారు?'' అని నిల దీశాను. ఒక్కటీ సవ్యంగా అంతుబట్టడం లేదు!

''అలాగా... చెబుతాను...'' అంటూ సంకో చించిన లెమన్, ''ఇది నీకు కాస్త దిగ్భ్రాంతి కలిగించవచ్చు. ఇప్పుడే మేము లెక్కించడం పూర్తి చేసుకుని, సేకరించిన లెక్కలను నివేదిం చడానికి అనునిర్వకు తిరిగి వెళుతున్నాం. అను నిర్వ నుంచి వెలుపలికి వచ్చేప్పుడల్లా మానవ రూపాలతోనే వస్తాం. లేకుంటే మమ్మల్ని బతక నివ్వరు. కాల్చేస్తారు. కొడతారు. బళ్ళకింద పడి

పోవచ్చు. మేము రైలులో ముంబైకి చేరుకుని అరేబియా సముద్రం నుంచి అనునిర్వ ఎక్స్‌ప్రెస్ ఆర్క్ పట్టుకుంటాం.

ఓమెన్ వేగంగా తల ఊపుతూ, ''అనునిర్వలో చాలినంత స్థలం ఉందా అని చూడడానికి ఆ 'ఒక్కరి'కి లెక్కలు వెంటనే కావాలట!'' అన్నాడు.

''ఏ లెక్కలు?'' అని అడిగాను నేను అయోమయంతో.

''మనుషుల లెక్కలు. జాబితాలో తదనంతరం అంటే వరుసలో తరవాత ఉన్నది మీరే!'' అన్నది లెమన్ గంభీరంగా, ''అంటే, మనుషులు అంతరించిపోతారనే కదా మీరు చెబుతున్నది?'' అని అడిగాను దిగ్భ్రాంతితో.

''అవును, నాన్నా! మీ జాతి భూమిని ఛిద్ర పరచింది. మీరు తప్పుకోలేదంటే, సకల ప్రాణులూ నాశనమైపోగలవు!''

''సాధ్యపడదు. ఈ భూగోళం మీద అత్యంత శక్తివంతమైన జాతి మాది. మేము ఎన్నటికీ



అంతరించిపోము,'' అని అరిచాను.

''ఈ పొగరు కారణంగానే మీరు పెద్దమొత్తం చెల్లించవలసి వస్తోంది!'' అన్నాడు ఓమెన్ దృఢమైన కంఠస్వరంతో.

''బ్రహ్మాండ విచ్ఛిన్నం జరుగబోతోంది. రేపు నువ్వు నిద్రలేచేసరికి సూర్యుడి చుట్టూ ఎర్రటి వలయం చూస్తావు. పగలు గడిచే కొద్దీ అది వేడెక్కుతుంది. సూర్యాస్తమయంతో సర్వం పూర్తవుతుంది,'' అన్నది లెమన్.

లెమన్ కళ్ళల్లోకి సూటిగా చూశాను. అగ్ని వలయాలు కనిపించాయి. ఉన్నట్టుండి ప్రపంచం నా కళ్ళ ముందు ఈదుతున్నట్టు అనిపించింది. నిద్ర ముంచుకొచ్చింది. ఎంతసేపు నిద్రపోయానో తెలియదు. మరునాడు పోర్టర్ తట్టి లేపినప్పుడు మెలకువ వచ్చింది. చుట్టుపక్కల కలయచూశాను. లెమన్, ఓమెన్ కనిపించలేదు. ''వాళ్ళెక్కడ?'' అని అడిగాను.

పోర్టర్ వింతగా చూస్తూ, ''ముంబై వచ్చేసింది. దిగు. బాబూ!'' అన్నాడు.

''లెమన్... ఓమెన్...''అని గొణుక్కున్నాను నాలో. అంతా కలగన్నానా?

రైలు దిగాను. నన్ను తీసుకువెళ్ళడానికి స్టేషనుకు వచ్చిన తాతయ్యను చూడగానే ఆప్యాయంగా కౌగిలించుకున్నాను.

వెలుపలికి వచ్చి తలెత్తి సూర్యుడి కేసి చూశాను. ప్రకాశిస్తున్న పసుపు గోళం సైక్లోప్స్ కన్నులా నాకేసి చూసింది. అలిసిన నా కళ్ళ ముందు అగ్నిగోళం అంచుల నుంచి మెల్లగా చిక్కటి ఎరుపు రంగు జాలువారడం ఆరంభమయింది. -(ఇంకా ఉంది)

- [సౌమ్యా రాజేంద్రన్]

# పాతాళదుర్గం - 11



[విరూపుడి సహాయం వల్ల, ధూమకుడు గరుడపక్షి బారి నుంచి బతికి బయటపడ్డాడు. తరవాత వాళ్ళకు అరణ్యంలో వికృతాకారు డొకడు కనిపించాడు. అతడు చెప్పిన దారి వెంట కొంత దూరం వెళ్ళి, ధూమకుడూ అతడి మిత్రులూ నదిలో పడవనూ, దాని చుట్టూ ఈదులాడే మొసళ్ళనూ చూశారు. సోమకుడు బాణంతో ఒకమొసలిని కొట్టాడు. -తరవాత]

సోమకుడి బాణందెబ్బ తగిలిన మొసలి కీచుమని అరుస్తూ, నీళ్ళల్లో విలవిలా తన్ను కోసాగింది. ఆ తన్నుకోవటంలో పైన ధరించిన మొసలిచర్మపు తొడుగు పోయి ఒక మానవాకారం బయట పడింది. అప్పటి వరకూ పడవ చుట్టూ ఈదుతున్న మొసళ్ళన్నీ ఒక్కసారిగా తమ పైతొడుగులను తొలగించివేసి, కేకలు పెడుతూ ఒడ్డుకు ఈదుకు రాసాగినై. అవి మొసళ్ళు కావు; మొసళ్ళ లాగా వేషాలు ధరించిన దృఢకాయులైన మనుషులు!

సోమకుడు ఆ వింత చూసి ఆశ్చర్యపోతూ, ''విరూపా, ఇది ఆశ్చర్యంగా లేదా? ఎవరీ మొసలి వేషాల మనుషులు? అసలు ఎవరిదీ పడవ?'' అన్నాడు.

ధూమకుడు అతణ్ణిమెల్లగా మాట్లాడమని హెచ్చరించి, ''చనిపోయే ముందు ఆ వికృతాకారుడు చెప్పిన మాటలు అప్పుడే మరిచిపోయావా? వీళ్ళు కాలకలి రాక్షసుడి బంట్లు. పడవ దగ్గిర కెవరూ రాకుండా వుండేందుకు వాళ్ళు మొసళ్ళలా కపట నాటకం ఆడుతున్నారు. వాళ్ళల్లో ఒకడి తల చితికేలా కొట్టి మనం చిక్కులో పడబోతున్నాం. చూడు, వాళ్ళంతా ఒడ్డెక్కి మనం వున్న చెట్ల కేసే పరీక్షగా చూస్తున్నారు,'' అన్నాడు.



"అవును, దొరా! బాణం వదలబోయే ముందే నాకు వాళ్ళు మనుషులై వుంటారన్న అనుమానం కలిగింది. కానీ నా హెచ్చరిక్కి ముందే సోముదొర బాణం వదిలేశాడు," అన్నాడు విరూపుడు.

ధూమకుడు ఓ క్షణకాలం వూరుకుని, ఏదో ఒక గట్టి నిర్ణయానికి వచ్చినవాడిలా తలాడించి, "ఆ మొసలిగాళ్ళు బాణం వచ్చిన దిక్కు కనుక్కున్నారు గాని, మనం ఈ చెట్టు పైన దాగి వున్నట్టు గ్రహించ లేదు. వాళ్ళి క్కడికి వచ్చే లోపలే మనం చెట్టు దిగి, పొదల మాటున పడి, కొండ మలుపులో ఉన్న చెట్ల గుంపు చేరదాం," అన్నాడు.

మరుక్షణంలోనే ముగ్గురూ కొమ్మలూ రెమ్మలూ కదలకుండా అతి జాగ్రత్తగా కిందికి దిగి, కొంత దూరం పోయి, గుబురుగా ఉన్న పొదల వెనకభాగానికి చేరారు.

ఇంతలో మొసలిమనుషులు రెండు ముఠాలుగా చీలారు. ఒక ముఠావాళ్ళు ధూమకుడూ వాళ్ళు వదిలిన చెట్టు కేసి బయలుదేరారు. రెండో ముఠా ఆయుధాలు సర్వసన్నద్ధంగా పట్టుకుని, మరొక వైపుగా పొదలన్నీ గాలిస్తూ కొండమలుపును చుట్టి రాసాగారు.

"ధూమూ, ఈ రాక్షసబంట్లు... రెండు పదులు... ఇరవైమంది ఉన్నారు. మనం ముగ్గురం-మొత్తం మీద గట్టి చిక్కులోనే పడ్డాం," అన్నాడు సోమకుడు.

"ఏ చిక్కుల్లోనూ పడకుండా మనం రాజ కుమార్తె కాంతిసేనను రాక్షసుడి బారి నుంచి కాపాడి తేగలమా? నీ ధైర్యసాహసాలను గురించి నాకు ఎలాంటి అనుమానమూ లేదు. అంత తప్పనిసరైతే, ఈ పొదలూ, పుట్టలూ చాటున పది మందినీ మనం హతమార్చి కొండ మీదికి పారిపోలేమా?" అన్నాడు ధూమకుడు కత్తిదూస్తూ.

ఆ వెంటనే విరూపుడు ఈటెను గుప్పెట బిగించి, ముందుకుచాచి పట్టుకున్నాడు. సోమకుడు విల్లుకు అంబు సంధించి ధూమ కుడి కేసి చూశాడు. మొసలిమనుషులు తమ చేతుల్లో ఉన్న ఈటెలతో పొదల మీద కొడుతూ, గుబురుచెట్లలోకి ఈటెలను బారు చేసి పొడుస్తూ, గొంతెత్తి, "ఎవర్రా మీరు? ఒకళ్ళా ఇద్దరా? బయటపడండి. ప్రాణాలతో మా నుంచి పారిపోలేరు. కాలకలి రాక్షసేంద్రుడి

మానవ బంట్లల్లో ఒకణ్ణి చంపిన మీ దుస్సాహసానికి ప్రతిఫలం–నిలువునా చర్మాలు వలిపించుకోవటం!'' అంటూ కేకలు గట్టిగా పెట్టసాగారు.

ధూమకుడు తతిమ్మా ఇద్దర్నీ హెచ్చరించి, తాము ఉన్న చోటు కేసి వస్తున్న మొసలి మనుషుల్నుంచి తప్పుకునేందుకు పొదల చాటుగా నక్కుతూ కొండమలుపు కేసి బయలుదేరాడు. మొసలి మనుషుల్లో ఒకడు ధూమకుడూ వాళ్ళూ ఉన్న దిక్కు కేసి పరీక్షగా చూసి, ''అక్కడేదో పొద కదులుతున్నది. మనవాణ్ణి చంపిన దుర్మార్గులు దానిచాటునున్నారని నా అనుమానం,'' అంటూ గబగబా అటు కేసి రాసాగాడు.

రానున్న ప్రమాదాన్ని పసికట్టిన విరూపుడు, ధూమక సోమకులను ముందుకు పోవలసిందిగా హెచ్చరించి, చప్పున అరచేతుల మీదా, మోకాళ్ళ మీదా వంగి, తాను దాగి ఉన్న పొదను తలతో, చేతులతో అల్లల్లాడిస్తూ, పులిలా భయంకరంగా ఒక్క రంకె వేశాడు.

అడవిలో పుట్టి పెరిగిన ఆటవికుల్లో చాలా మందికి అడవి జంతువుల అరుపులూ, పక్షుల కేకలూ వేయటంలో చాలా నేర్పు ఉంటుంది. విరూపుడు ఆ విద్యల్లో అందె వేసిన చేయి. అతడు పెట్టిన రంకె వింటూనే, మొసలిమనుషులందరూ భయంతో కంపించిపోయి ఉన్న చోటునే ఆగిపోయారు. అందరికన్నా ముందు పొద దగ్గరకు పరిగెత్తుకొస్తున్నవాడు ఆ రంకెకు అదురుకుని బోర్లా పడిపోయి, లేస్తే పులి మీద పడుతుందన్న భయంతో వెనక్కు దొర్లుకుంటూ పోసాగాడు.

''పులి! వెనక్కు తగ్గండి,'' అన్నాడొక మొసలిమనిషి.

''అది మామూలు పులికాదు, బాగా ఆకలిగొన్న పోతుపులి!'' అన్నాడు మరొకడు.

''నీ తెలివి అఘోరించినట్టుంది. ముందు పొదల్నించి దూరంగా పరిగెత్తండి. అది ఇప్పుడే పిల్లల్నినిన ఆడపులి, అరుపు తెలియటం లేదా?'' అన్నాడింకొకడు.

వాళ్ళీ విధంగా మల్లగుల్లాలు పడుతూంటే, అది అవకాశంగా తీసుకుని ధూమకుడూ అతడి మిత్రులూ పొదల మాటునదాక్కుంటూ





అంత ఎత్తు నుంచి సూటిగా తమ కేసే చూస్తున్నారు.

''సోమూ, విరూపా. మనం ఎక్కడున్నామో వాళ్ళకు తెలిసిపోయింది. క్షణంలో ఆ రెండు ముఠాలూ ఏకమై మనలను చుట్టుముడ తారు. ఆ చిటారుకొమ్మల్లో ఉన్న దుర్మార్గులిద్దర్నీ చూశారా?'' అన్నాడు ధూమకుడు.

ధూమకుడు మాట ముగించేలోపలే, కొమ్మల్లో ఉన్న మొసలిమనుషు లిద్దరూ పాలోమంటూ పెద్ద కేక పెట్టి, ''పులీ లేదు గిలీ లేదు, భయపడకండి. ఆ దుష్టులు ముగ్గురూ కొండముచ్చుల్లా పొదల వెనక దాక్కుని ఉన్నారు. వాళ్ళు కొండమలుపు తిరిగి కీకారణ్యంలోకి పారిపోకుండా, ఇక్కడే చుట్టుముట్టి పట్టుకోండి,'' అన్నారు.

''అమ్మా, రాక్షసబ్బంటుల్లారా! మీరు మమ్మల్ని కనిపెట్టే ఉన్నారన్నమాట. ఆ ఇద్దర్నీ ఒకే బాణంతో కింద పడకొడతాను,'' అంటూ సోమకుడు విల్లంబు ఎక్కుపెట్టాడు.

''ఇద్దరో ఒకడో... ముందు బాణం వదులు. వాళ్ళు హడలుకుని చెట్టు దిగుతారు. అప్పుడు మనల్ని ఎత్తు నుంచి చూసి, మనం పారిపోయే దారి తతిమ్మా వాళ్ళకు చెప్పేవాళ్ళు ఉండరు,'' అంటూ ధూమకుడు, సోమకుణ్ణి తొందర పెట్టాడు.

ఈ లోపల సోమకుడు గురి చూసి బాణం వదలనే వదిలాడు. అది కొమ్మల్లో ఉన్న ఒక మొసలి మనిషి గుండెల్లో బలంగా తాకింది. వాడు కెవ్వుమని అరుస్తూ, కింద పడబోయే సమయంలో ఆధారం కోసం ఎగిరి, పక్కనున్న

కొండ మలుపు కేసి పోసాగారు. ప్రస్తుతానికి ప్రమాదం తప్పిందన్న నమ్మకం ఆ ముగ్గురికీ ఎంతో ఉత్సాహం కలిగించింది. సోమకుడు, విరూపుడి భుజం తడుతూ, ''విరూపా! ఆ దుష్టుల్ని భలే హడల కొట్టావ్. చూడు, వాళ్ళెలా వణికిపోతున్నారో,'' అన్నాడు.

ముందు నడుస్తున్న ధూమకుడు మొసలి మనుషుల కేసి ఓ మారు చూసి, ''వీళ్ళ మాట సరే. ఆ రెండో ముఠా ఏమయింది?'' అంటూ తాము దిగి పారిపోయి వచ్చిన మహా వృక్షాని కేసి చూశాడు. ఆ క్షణంలోనే అతడి శరీరం భయంతో కంపించిపోయింది. మొసలి మనుషుల రెండవ ముఠా వాళ్ళిద్దరు ఆ వృక్షం చిటారుకొమ్మల మీద నిలబడి, ఎండ పొడ పడకుండా కళ్ళకు చేతులడ్డం పెట్టుకుని,

రెండవవాడి నడుం పట్టుకున్నాడు. ఆ వూపుకు ఆ రెండవవాడు చేతుల్లో ఉన్న చెట్టుకొమ్మ పట్టుజారి, గాయపడిన వాడితోపాటు, అంత ఎత్తు నుంచి దభీమంటూ కిందపడిపోయాడు.

''ఒక్క వేటుకు రెండు పక్షులంటే, ఇదే సోముదొరా!'' అంటూ విరూపుడు ముంచు కొస్తున్న ప్రమాదాన్ని మరిచిపోయి, ఉత్సాహంగా కేకపెట్టాడు.

''పరిగెత్తండి. కొండమలుపు తిరిగితే కీకారణ్యం. అక్కడికి పారిపోగలిగామంటే, ఇక మనలను ఈ రాక్షసబ్బంట్లు పట్టుకోలేరు. మన దారిని అడ్డగించకుండా, వెనక నుంచి ఈటెవేటు దూరంలోకి రాకుండా మాత్రం, మనం వాళ్ళను ప్రతిఘటించాలి,'' అన్నాడు ధూమకుడు.

కొండమలుపు కేసి బాగా నలిగిన కాలి బాట ఒకటున్నది. ఆ బాట తొక్కినవాళ్ళు కాలకలి రాక్షసుడిబంట్లు. వాళ్ళు గూడేల మీద పడి జనాన్ని పట్టుకుపోయేందుకు వచ్చినప్పుడల్లా, ఈ ప్రాంతాలనే నదిని దాటుతూంటారు. ధూమకుడూ, అతడి మిత్రులూ ఆ బాట వెంట కొండమలుపు కేసి పరిగెత్త సాగారు. ఆ మలుపులోనే శత్రువుల పడవ నది ఒడ్డు నున్న పెద్ద చెట్టుబోదెకు బలమైన మోకుతో బంధించబడి ఉన్నది.

ధూమకుడు ఊహించినట్టు శత్రుముఠాలు రెండూ ఏకమై వాళ్ళ వెంటబడలేదు. వాళ్ళల్లో ఒక ముఠా కొండమలుపు కేసి పరిగెత్తసాగింది. అక్కడ ధూమకుడూ వాళ్ళ దారిని అటకాయించాలని వాళ్ళ ప్రయత్నం.



ఇక రెండవ ముఠా వెనక నుంచి కాలిబాట వెంట వాళ్ళను తరుముకు రాసాగింది.

ధూమకుడు ఈ రెండు గుంపుల్లో దేనికీ చిక్కకుండా కొండ ఎక్కి పారిపోయే మార్గం ఏదైనా ఉన్నదేమో అని చుట్టూ కలయ చూశాడు. అది సాధ్యమయ్యేలా అతడికి కనిపించలేదు. ఆ ప్రాంతాల కొండ భాగం పెద్దపెద్దరాళ్ళతో, పొదలతో కాలు మోపేందుకే వీలులేకుండా ఉన్నది. ఇక ఉన్న చోటునే నిలిచి శత్రువులతో పోరాడటం తప్ప ధూమకుడికి మరో మార్గం తోచలేదు.

''సోమూ, మనలను వెనక నుంచి తరుముకు వస్తున్న వాళ్ళ మీద బాణాలు వదులు. నేనూ, విరూపుడూ వాళ్ళు విసిరే ఈటెలు నీకు తగలకుండా చూస్తుంటాం,'' అన్నాడు ధూమకుడు.

సోమకుడు చప్పున మోకాలి మీద వంగి, విల్లంబు ఎక్కుపెట్టి పరిగెత్తుకు వస్తున్న మొసలిమనుషుల్లో ఒకణ్ణి కొట్టాడు. బాణం తగలగానే వాడు ఒక చావు కేక పెట్టి కింద పడిపోయాడు. అదే అదనుగా సోమకుడు మరొక బాణంతో ఇంకో శత్రువును కొట్టాడు.

కానీ, ఈసారి బాణం మొసలిమనిషి గుండెల్లో కాకుండా, భుజంలో గుచ్చుకున్నది. వాడు కెవ్వున అరిచి చతికిలబడ్డాడు. మొసలి మనుషులు భయపడి కాలిబాట వదిలి తుప్పలచాటుకు పరిగెత్తారు.

''సోమూ, విరూపా! కొండమలుపులో మనను అటకాయించేందుకు పరిగెత్తుతున్న దుర్మార్గుల మీదా ఇదే మంత్రం ప్రయోగించాలి. ఏవీ, శత్రువులు మన మీద విసిరిన ఈటెలు?'' అంటూ ధూమకుడు ఆ ప్రాంతాలలో పడివున్న ఈటెలు రెండు తీసుకుని ముందుకు పరిగెత్తసాగాడు. విరూపుడూ, సోమకుడూ కూడా కొన్ని ఈటెలు తీసుకుని అతణ్ణి అనుసరించారు.

ఆ సరికి మొసలిమనుషుల్లో రెండో ముఠా కొండమలుపును చేరింది. వాళ్ళు ఈటెలు పైకెత్తి అటూ ఇటూ ఆడిస్తూ, ''లొంగిపొండి! మిమ్మల్ని చంపకుండా కాలకలిరాక్షసేంద్రుడి పాతాళదుర్గానికి తీసుకుపోతాం. అలా చేయకపోయారో ఇవ్వాళతో మీకు భూమ్మీద నూకలు నిండుకున్నట్టే,'' అంటూ గట్టిగా కేకలు వేశారు. -(ఇంకా ఉంది)



# భారత దర్శిని

## కుతుబ్ షాహీ మసీదులు



దక్షిణ భారతదేశాన్ని దాదాపు డెబ్భై సంవత్సరాలు పరిపాలించిన కుతుబ్‌షాహీవంశానికి చెందిన ఏడుగురు రాజుల మసీదులు హైదరాబాదులో వంద ఎకరాల్లో విస్తరించి ఉన్నాయి.1518-1687మధ్య కాలంలో ఈ మసీదుల నిర్మాణం జరిగింది. హైదరాబాదు, దాని పరిసర ప్రాంతాల సంస్కృతినీ, జీవితాన్నీ ఈ ప్రాంగణం ప్రతిబింబిస్తోంది. అబ్దుల్ హసన్ తానీషాగా ప్రసిద్ధుడైన మీర్జా నిజాముద్దీన్ అహ్మద్ అసంపూర్ణ మసీదు; ఆరవ కుతుబ్‌షా అబ్దుల్లా కులీ తల్లి హయత్ బక్షీ బేగమ్ మసీదు ఈ ప్రాంగణంలోనే ఉన్నాయి. ఈ కుతుబ్ షాహీమసీదులను ప్రపంచ వారసత్వ ప్రదేశాల జాబితాలోకి తీసుకోమని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం యునెస్కోను అభ్యర్థించింది.

## వస్తు మార్పిడికి మాత్రమే

యేటా జనవరి నెలలో వారం పాటు జరిగే జోన్‌బీల్ మేళా ఉత్సవం చాలా భిన్నమైనది. ఈ సంతలో ఏ వస్తువునుగానీ డబ్బుకు కొనడం లేదు. మరో వస్తువునిచ్చి మాత్రమే కొనుక్కుంటారు. అస్సాం గౌహతి సమీపంలోని జాగీరోడ్‌లో జరిగే ఈ సంతలో మేఘాలయాకు చెందిన కాసీ గిరిజనులు వందలాది మంది వచ్చి స్థానికులైన టీవా గిరిజనుల నుంచి వస్తుమార్పిడికి వస్తువులు తీసుకువెళతారు. అల్లం, పసుపు, అడవి తేనె ఈ వస్తువుల్లో చాలా ముఖ్యమైనవి. చేనేత దుస్తులు కూడా మార్చుకుంటారు. ఈ సందర్భంగా జరిగే కోళ్ళ పందాలు వినోదభరితంగా సాగుతాయి. చేపల వేట సాగిస్తారు. బహుశా దేశం మొత్తం మీద వస్తు మార్పిడి పద్ధతి ఇంకా ఆచరణలో ఉన్నది ఇక్కడ మాత్రమే!



ఆ స్టేషన్‌లో అంతా మహిళా పోర్టర్లే telugu.chandamama.com భారత దర్శిని చూడండి





# రెండు చెట్ల కథ

క్రీ.శ. 1798, శివగంగైసీమై, తమిళనాడు. దృఢకాయులైన ఇద్దరు గుర్రాలపై ఒక గ్రామాన్ని సమీపించారు. సూర్యుడు పడమటి కొండలను సమీపిస్తున్నాడు. మధ్యాహ్నం వరకు వాళ్ళు ఒకరథంలోనే ప్రయాణం చేశారు. దారిలో రథం ఇరుసు విరిగి నేలకు ఒరగడంతో, అక్కడి నుంచి వాళ్ళు గుర్రాలపై పయనించ వలసి వచ్చింది.

వాళ్ళు గ్రామాన్ని సమీపిస్తూండగా, ఆ ఇద్దరిలో ఎత్తుగా ఉన్న వ్యక్తి తమ్ముడితో, "అదిగో ఆ 'మరుదు' చెట్లకేసి చూడు. ఎంత



దృఢంగా ఉన్నాయో! అవి మన రథాలు తయారుచేసుకోవడానికి పనికివస్తాయి కదా?" అన్నాడు.

"చాలా దృఢంగా ఏపుగా పెరిగి ఉన్నాయి. తప్పక పనికి వస్తాయి," అన్నాడు తమ్ముడు.

అడ్డపంచ, తలపాగాతో ఉన్న ఒక వృద్ధుడు దీక్షతో ఆ చెట్లకు పసుపు రాస్తున్నాడు. "ఎలాంటి కొరతా లేకుండా హాయిగా గడిచిపోతూన్న ఈ రోజుల్లో ఈ రఘునాథ దేవర్ నుంచి మీకేం కావాలి నాయనా?" అని వృద్ధుడు వాళ్ళను అడిగాడు.

అన్నదమ్ములు ఒకరినొకరు చూస్తూ నవ్వు కున్నారు. ఆ తరవాత ఒకడు, "మీకు ఏ కొరతా లేకుండా ఉండవచ్చు. అయినా మాకు ఓ అవసరం వచ్చి పడింది. ఈ చెట్లు చూస్తూంటే చాలా దృఢంగా కనిపిస్తున్నాయి. మా రథానికి ఇరుసు కావాలి. అవి అందుకు పనికివస్తాయి. వాటిని కొట్టుకోవడానికి అనుమతించగలరా?" అని అడిగాడు.

ఆ మాటతో తటాలున లేచి నిలబడిన వృద్ధుడు, "ఆ మాట అనడానికి మీకెంత ధైర్యం? మిమ్మల్ని చూసి పెద్దమనుషుల నుకుని పొరబడ్డానే. ఈ మరుదు చెట్లను శివగంగై పాలకులు మరుదు సోదరులుగా భావించి పూజిస్తున్నామని మీకు తెలియదా?" అన్నాడు కోపావేశంతో.

ఆ తరువాత కొంత సేపటికి శాంతించి, ''బహుశా మీరీప్రాంతానికి కొత్త అను కుంటాను,'' అన్నాడు వృద్ధుడు.

అన్నదమ్ములు మళ్ళీ ఒకరినొకరు చూసుకుంటూ తమలో తాము చిన్నగా నవ్వుకున్నారు.

''అందువల్ల, మిమ్మల్ని ఇక్కడినుంచి తరమకుండా ఆ వీరుల కథ చెబుతాను. అప్పుడైనా వాళ్ళ గొప్పదనం తెలుసు కోండి,'' అంటూ అతడు చెప్పసాగాడు:



✻ ✻ ✻

*క్రీ.శ. 1772, కాళైయర్ కోయిల్, శివగంగై.*

ఒక యువకుడు నేలకు సగం ఒరిగిన అచేతనమైన ఒక ఆజానుబాహువు దేహాన్ని పట్టుకుని కూర్చున్నాడు. పెల్లుబికే కన్నీళ్ళు యుద్ధరంగంలో వీచే వేడిగాలులకు ఆవిరై పోతున్నాయి. శవాలను పీక్కుతినడానికి రాబందులు, కాకులు రొదచేస్తూ ఎగురుతు న్నాయి. పక్కనే సైనికుడి దుస్తులలో ఒక స్త్రీ కూర్చుని ఉన్నది. ఆమె చేతిలో రక్తసిక్తమైన ఖడ్గం. కన్నీళ్ళు పెల్లుబుకుతున్నప్పటికీ ముఖంలో దృఢ నిశ్చయం, కళ్ళల్లో ఆగ్రహం; మానవరూపం దాల్చిన కాళీమాతలాగా ఆమె కనిపించసాగింది. ''మహారాణీ, ఇకమను ఇక్కడ ఉండకూడదు!'' అన్న కంఠస్వరం వినిపించడంతో ఆమె తల పైకెత్తి చూసింది.

''ఆలస్యం చేయకూడదు. వెంటనే తప్పించుకోవాలి,'' అన్నది మళ్ళీ ఆ కంఠస్వరం.

''అంటే, మనం ఓడిపోయి పారిపోయామని ఆర్కాటు నవాబు సైనికులు భావించాలా? శత్రువుల చేత హతుడై, నా భర్త ఇక్కడ పడి ఉండగా నేను పారిపోవాలా...'' అని అడిగింది రాణి వేలునాచ్చియార్ ఉద్వేగంతో.

''ఆయన మరణించలేదు. రాజా ముత్తు వడుగనాదర్ మన హృదయాలలో సజీవంగా కొలువున్నారు!'' అన్నాడు మృతదేహాన్ని పట్టుకున్న యువకుడు.

ఆ ఇద్దరూ చూస్తూండగా ఆ యువకుడు లేచి నిలబడుతూ, ''మా అన్న పెరియమరుదు



చెప్పడం నిజం. మనం సమయం వృథా చేయ కూడదు,'' అన్నాడు.

శివగంగైరాణిసందిగ్ధంలోపడింది. ''విశ్వాస పాత్రులైన దళపతులుగా మీ సలహాను గౌర విస్తాను. అయితే, మనం ఇప్పుడు ఎక్కడికి వెళ్ళగలం? మన సైనికులను ఇక్కడ ఒంట రిగా పోరాడమని వదిలిపెట్టి మనం మాత్రం వెళ్ళడం భావ్యమేనా?'' అన్నది.

''దళపతులైన చిన్న మరుదుకూ, నాకూ మిమ్మల్నీ, మీ మనుషులనూ రక్షించే బాధ్యత ఉన్నది. మేము మిమ్మల్ని దిండుక్కల్‌కు తీసుకువెళ్ళి, అక్కడ హైదర్-అలీ రక్షణను కోరదాం. ఆయన తప్పక ఆశ్రయం ఇవ్వ గలడు,'' అన్నాడు పెరియమరుదు మెరిసే కళ్ళతో.

''హైదర్-అలీ వద్దకా?'' అని ఆశ్చర్యపో యిన రాణి వేలునాచ్చియార్, ''అయినా, తిరోగమించడం అన్నది...'' అంటూ అర్ధాంత రంగా ఆగింది.

''...మరో రోజు మళ్ళీ దాడి చేయడానికే,'' అని మాటను పూర్తి చేసిన పెరియమరుదు, ''మళ్ళీ మనం సేనలను సమీకరించుకుని తిరగబడగలమని రాజుగారి భౌతికకాయం సాక్షిగా ప్రమాణం చేస్తున్నాను!'' అన్నాడు గంభీరంగా.

''మీ మాటలను విశ్వసిస్తున్నాను. నా ప్రాణ మానాలను, ప్రజలను మీకు అప్పగిస్తున్నాను, బయలుదేరుదాం,'' అంటూ లేచి నిలబడింది రాణి వేలునాచ్చియార్.

✻ ✻ ✻

*క్రీ.శ. 1781, శివగంగై రాజభవనం*

ఎటు చూసినా ఆనందోత్సాహాలు! ''రాజా పెరియమరుదు వర్ధిల్లాలి! రాజా చిన్నమ రుదు వర్ధిల్లాలి!!'' నినాదాలతో ప్రాంగణం మారుమోగుతోంది.

ఆజానుబాహులైన ఇద్దరు సోదరుల తలలు నిమురుతూ వేలునాచ్చియార్, ''ఈ భూమిని మరుదు సోదరులు పరిపాలించాలి. వాళ్ళ కీర్తి ప్రతిష్ఠలు ఎన్నటికీ తరగకూడదు,'' అని ఆశీర్వదించింది.

ఆ ఇద్దరే ఎనిమిదేళ్ళ క్రితం శత్రుసైనికుల ముట్టడి నుంచి ఆమెను రక్షించారు. ఆ రోజు వాళ్ళు ఆమెకిచ్చిన మాటను ఇప్పుడు నిల బెట్టుకున్నారు. ఆ ప్రాంతంలో పన్నులు వసూలు చేయలేక, ఆర్కాటు నవాబు మళ్ళీ రాణి పాలనను ప్రవేశపెట్టమన్నాడు. ఆ విధంగా ఆమె భర్త రాజ్యం మళ్ళీ ఆమె వశం కావడానికి మరుదు సోదరులు అత్యద్భుత

మైన ధైర్యసాహసాలు ప్రదర్శించారు. ఆమె ఆ మాట చెప్పగానే, ''మేము మీ వారసులమా?'' అని ఆశ్చర్యపోయిన పెరియమరుదు, ''మేము మీ సైన్యంలో దళపతులం మాత్రమే. రాజవంశ వారసులం కాము కదా?'' అన్నాడు.

''రాజవంశానికి ఇప్పుడు వారసులు లేరు. మీరు మా తాతగారి సైన్యంలో సుశిక్షితులైన వీరులు. ఖడ్గ చాలనంలో మీకు సాటి రాగల వారు శివగంగైలో లేరు. తిరోగమించి దిండుక్కల్‌కు తప్పించుకోవడం-మీ తెలివైన వ్యూహాన్ని చాటింది. మొక్కవోని ధైర్యసాహసాలు, నిర్విరామ ప్రయత్నాల ద్వారా శివగంగైని కాపాడి మళ్ళీ ప్రజలకు అప్పగించగలిగారు. నా భర్తకు తగిన వారసులు మీకు మించి కనిపించరు,'' అన్నది వేలునాచ్చియార్.

ఉద్వేగపూరితులైన మరుదు సోదరులు తలలు వంచి కృతజ్ఞతతో చేతులు జోడించారు. అయినా న్యాయస్థాన ప్రతినిధులు ఇద్దరు సైనికులను రాణి తన వారసులుగా ప్రకటించడాన్ని ఆమోదించలేకపోయారు.

* * *

''అదీ అయ్యలారా, మా పాలకుల అద్భుత చరిత్ర! వారు పూజనీయులని మీరూ అంగీకరిస్తారు కదూ! వారి పేరున ఈ చెట్లను పూజించడం న్యాయమే కదా?'' అని అడిగాడు రఘునాధ దేవర్.

''నువ్వు ఇంతగా చెబుతూంటే ఎలా కాదనగలం? నీ లాంటి విశ్వాసపాత్రులైన ప్రజలను కలిగి ఉండడం ఏ పాలకులయినా గొప్ప భాగ్యంగానే భావిస్తారు,'' అన్నాడు పెద్ద వ్యక్తి.

''నిజమే. నన్ను గురించిగాని, ఈ చెట్లను గురించిగాని వాళ్ళకు తెలియదు కదా. నా తరవాత ఈ చెట్ల రక్షణ ఎవరు చూసుకుంటారు?'' అన్నాడు దేవర్ విచారవదనంతో.

''వాటి పరిరక్షణకు మేమే కొందరిని నియమిస్తాం. మరుదు సోదరులైన మా నిర్ణయాన్ని ధిక్కరించే సాహసం ఎవరికి ఉంటుంది?'' అన్నాడు తమ్ముడు అన్నకేసి చూసి నవ్వుతూ. రఘునాధ దేవర్ ఒకసారి వాళ్ళకేసి నమ్మలేనట్టు చూశాడు. మరుక్షణమే, ''ప్రభువులారా!'' అంటూ వాళ్ళ పాదాలపై పడిపోయాడు.

శివగంగై పాలకులైన ఆ పెరియ మరుదు, చిన్న మరుదు అతణ్ణి ఆప్యాయంగా లేవనెత్తారు. అతడు వాళ్ళ వెంట రాజధానికి వెళ్ళి, సఫలవంతమైన జీవితం గడిపాడు.





# మన వారసత్వ స్థలాలు

## ఎల్లోరా గుహలు

స్థానికంగా 'వెరూర్‌లేని' అని పిలువబడే ఎల్లోరా గుహలు ఔరంగాబాదుకు, ఉత్తర-వాయవ్య దిశలో ఉన్నాయి. భారతీయ గుహాలయ శిల్పకళకు ప్రాతినిధ్యం వహించే ఎల్లోరా గుహలు క్రీ.శ.5-10 శతాబ్దాల మధ్యకాలంలో రాష్ట్రకూట వంశస్థులచే నిర్మించబడ్డాయి.

ఎల్లోరా కొండగుహలలో మలచిన 34 గుహాలయాలు ప్రాచీన, మధ్య యుగాలలో మనదేశంలో వెలుగొందిన హిందూ, బౌద్ధ, జైన మత విశ్వాసాలను మన కళ్ళముందు సాక్షాత్కరింపజేస్తాయి. మానవ మేధస్సుకు అభివ్యక్తీకరణగా వెలసిన దక్కను శిల్పకళా నిర్మాణ శైలి పరిపూర్ణ పరిణత తుది దశకు ఉదాహరణగా ఈ గుహాలయాలను పేర్కొంటారు.

ఈ 34 గుహాలయాలూ నిటారుగా ఉన్న చరణాంద్రికొండలో తొలచబడినవే. వీటిలో 12 గుహలు బౌద్ధమతానికీ(1-12), 17 గుహలు హిందూ మతానికీ(13-29), 5 గుహలు జైన మతానికీ(30-34) సంబంధించినవి. ఇవి పక్క పక్కనే నిర్మించబడడం ప్రధానమైన ఆ మూడు మతాల మధ్య మన దేశ చరిత్రలో వెలుగొందిన సామరస్యానికి ప్రత్యక్ష నిదర్శనం. ఇక్కడి మహాకైలాసం(16వ గుహ) అతి పెద్ద ఏకశిలా నిర్మిత గుహాలయంగా ప్రపంచ ప్రసిద్ధిగాంచింది.

విభిన్నమైన మూడు మతాలకు సంబంధించిన ఆలయాలు పక్క పక్కనే ఉండడం భారతదేశంలో నెలకొన్న మత సామరస్యానికీ, మత సహనానికీ నిదర్శనంగా చెప్పవచ్చు. మిగతా విషయాలతో పాటు ముఖ్యంగా ఈ కారణంగానే ఎల్లోరా గుహలను యునెస్కో 1983వ సంవత్సరంలో ప్రపంచ వారసత్వజాబితాలోకి తీసుకున్నది.




మంగళవారాలలో తప్ప తక్కిన రోజులలో సూర్యోదయం నుంచి సూర్యాస్తమయం వరకు చూడడానికి అనుమతిస్తారు.

ప్రవేశ రుసుము: భారత పౌరులకు, సార్క్ దేశాల(బంగ్లాదేశ్, నేపాల్, భూటాన్, శ్రీలంక, పాకిస్థాన్, మాల్దీవులు, ఆఫ్ఘనిస్థాన్) పౌరులకు రూ.10లు. తక్కినవారికి 5 అమెరికన్ డాలర్లు. 15 ఏళ్ళలోపు పిల్లలకు ఉచితం.

భారతదేశం నుంచి మొట్టమొదటి సారిగా నోబెల్ బహుమతి అందుకున్నవారెవరు?

a) సి.వి.రామన్

b) రవీంద్రనాథ్ టాగూర్

మీ సమాధానాన్ని CIHQ <space><a\b\> 54646కు SMS చెయ్యండి. మరియు మీ మొబైల్లో ఇండియన్ హెరిటేజ్ క్విజ్ ఆడుకోండి.



# సీమచింతకాయలు



బసవయ్యకు జమీందారు దివాణంలో ఉద్యోగమన్న మాటేగాని బండెడు చాకిరీ చేసినా చాలీచాలని జీతం. గుపెడు సంసారం. ఎప్పుడూ రోగంతో మంచాన పడి మూలిగే తల్లి. అది కావాలి, ఇది కావాలి అని సదా పీక్కుతినే పిల్లలు. తన చేతకానితనాన్ని దెప్పిపొడుస్తూ చీటికి మాటికి అవమానించే భార్య. మంచివాడే గాని బతకడం తెలియని అర్భకుడని చాటుమాటుగా పరిహసించే ఇరుగుపొరుగు.

బసవయ్యకు ఆలోచిస్తున్న కొద్దీ బతుకు మీద రోత పుట్టుకొచ్చింది. ఇన్నాళ్ళు కలిసి కాపురం చేసి, తను పడుతున్న శ్రమ కళ్ళారా చూస్తూ కూడా కట్టుకున్న భార్య మరికాస్త మజ్జిగ అడిగినందుకు ఇంత హీనంగా మాట్లాడుతుందా? ఎవరి కోసం ఇలా కష్టపడాలి? అందరిచేతా అవమానపడాలి?

అని బాధపడిపోయి ఎందుకీపాడు బతుకు అని తీర్మానించుకుని ఒకనాడు తెల్లవారకముందే గొడ్లచావడి నుంచి ఒక పలుపుతీసి భుజానవేసుకుని బయలుదేరాడు.

ఊరి పొలిమేర దాటాడు. అల్లంత దూరాన ఒక పెద్ద చెట్టు కనిపించింది. వెళ్ళి దాని కింద నిలబడి అటూ ఇటూ చూశాడు. పలుపు తాడు తీసి ఒక వైపున ఉచ్చుముడి వేశాడు. ముడి వేసిన రెండో చివరను ఎడమ చేత్తో పట్టుకుని మొదటి కొసను చుట్టచుట్టి కుడి చేత్తో ఎత్తు కాస్త కిందుగా ఉన్న కొమ్మలకేసి విసిరాడు. ఎన్నిసార్లు ప్రయత్నించినా ఏ కొమ్మకూ తాడు తగులుకోలేదు. చావటానికూడా తనకు చేతకావటం లేదు అని విసుక్కున్నాడు బసవయ్య.

ఇక లాభం లేదనుకుని ఆఖరు ప్రయత్నంగా తాడుతో పాటు అతి ప్రయత్నం మీద చెట్టెక్కాడు. బాగా దృఢంగా ఉండే కొమ్మకు తాడు ఒక కొసను బిగించి లాగి చూశాడు. సరిగ్గా అప్పుడే బలంగా గాలి వీచింది. కొమ్మలన్నీ గలగలమన్నాయి. అతడి ఒంటికి గుత్తులు

గుత్తులుగా వంకీలు తిరిగిన సీమచింత కాయలు చల్లగా తగిలి గిలిగింతలు పెట్టాయి.

వాటిని చూడగానే బసవయ్య వచ్చిన పని మరచిపోయి రెండు గుత్తులు సీమచింత కాయలు కోసుకున్నాడు. అంతలో ఎక్కడ నుంచి వచ్చాయో ఏమోగాని రకరకాల పిట్టలు వచ్చి కొమ్మలమీద, అతడి మీద వాలాయి. కితకితలు పెట్టినట్టయి బసవయ్య పులకించి పోయాడు. ఒక సీమచింతకాయ ఒలిచాడు. కడిగిన ముత్యాల్లా తెల్లగా మెరిసే తొనలు. వాటి లోపల నల్లటి మణిపూసల్లాంటి గింజలు. ''నాకు... నాకు...'' అన్నట్టు పిట్టలు కిలకిల మనడంతో, ఒక్కొక్కటిగా ఒలిచి వాటికి అందించాడు. చేతికందిన కాయలను కోసి పక్క జేబుల్లో నింపుకున్నాడు.



''ఇక చాలు నాయనా, కిందికి దిగిరా,'' అన్న మాటలు వినిపించి ఉలిక్కిపడి కిందికి చూశాడు.

చెట్టు కింద తెల్లటి దుస్తులతో తల పండిన పొడవాటి వృద్ధుడొకడు కనిపించాడు. బస వయ్య చెట్టు పై నుంచి గబగబా కిందికి దిగి వచ్చాడు.

''ఏం నాయనా, తెచ్చుకున్న తాటిని చెట్టు మీదే వదిలేశావు?'' అని అడిగాడు వృద్ధుడు నవ్వుతూ. తను ఏ ఉద్దేశంతో ఆవేశంగా ఆ చెట్టు వద్దకు వచ్చిందీ అప్పుడు గుర్తొచ్చింది బసవయ్యకు.

''నేనిందాకటి నుంచి నిన్ను గమనిస్తూనే ఉన్నాను. దేవుడిచ్చిన ప్రాణాన్ని దేవుడే తీసు కోవాలి గాని, దానికి విరుద్ధంగా నడుచుకునే హక్కు మనిషికి లేదు. అయినా కష్టాలు అన్నవి ఎవరికి మాత్రం లేవు? పుట్టిన ప్రతి జీవికీ ఉంటాయి. కష్టాలున్న వారందరూ చెట్లకు ఉరేసుకుంటే భూమ్మీద మనుషులే మిగలరు,'' అన్నాడు వృద్ధుడు.

## చందమామ లోకజ్ఞానం క్విజ్-3(ఏప్రిల్'09)

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఎంట్రీలు పాఠకుల నుంచి ఒక్కటీ రాలేదు. అందువల్ల బహుమతి ఇవ్వలేకపోతున్నాం. సమాధానాలకు 35వ పేజీ చూడండి.

బసవయ్య సమాధానం చెప్పలేక అలాగే చూస్తూండిపోయాడు.

వృద్ధుడు మళ్ళీ, ''ప్రకృతిని ఒకసారి చూడు. చెట్లు ఆయా కాలాలకు అనుగుణంగా పళ్ళు, కాయలు అందిస్తున్నాయి. ఆఖరికి ముళ్ళతో నిండిన సీమచింతచెట్టు కూడా తియ్యటి కాయల్ని ఇస్తున్నాయి కదా? నీడ లేని వారికి నీడనిస్తున్నాయి. నదులు, సెలయేళ్ళు దాహం తీరుస్తున్నాయి. ఇంకా ఏం కావాలి మనిషికి? ఇంతెందుకు? నన్ను చూడు. నాకెవ్వరూ లేరు. ఒంటరి వాణ్ణి. అయినా బతుకుతున్నాను. ఎవరికోసం? నాకోసమే బతుకుతున్నాను. నీకేం తక్కువ చెప్పు? దేవుడిచ్చిన కాళ్ళు చేతులు సలక్షణంగా ఉన్నాయి. ఆలోచించే శక్తి ఉంది. ఆప్యాయత నిండిన కుటుంబం ఉంది. కష్టాలను చూసి కుంగిపోకుండా, వాటి నుంచి పారిపోవాలని ప్రయత్నించకుండా పరిష్కరించుకోవడానికి ప్రయత్నించు. వ్యాధిగ్రస్తురాలైన తల్లినీ, నిన్నే నమ్ముకున్న భార్యాబిడ్డలనూ వదిలేసి నీ స్వార్థం నువ్వు చూసుకోవడం భావ్యం కాదు. పిచ్చి ఆలోచనలు మాని ధైర్యంగా ఇంటికి తిరిగివెళ్ళు,'' అన్నాడు.

గాఢంగా నిట్టూర్చిన బసవయ్య తలపంకించి జేబులోంచి గుప్పెడు సీమచింతకాయలు తీసి ఆయనికివ్వడానికి పక్కకు తిరిగి చూసేసరికి వృద్ధుడు అక్కడ కనిపించలేదు.

ఆశ్చర్యచకితుడైన బసవయ్య వృద్ధుడికి మనసులోనే కృతజ్ఞతలు తెలియజేసి, సూర్యుడు ఉదయిస్తూండగా, సీమచింతకాయలతో నూతనోత్సాహంతో వడివడిగా ఇంటిదారి పట్టాడు.

-జి.సి. జీవి





# పెద్ద శాపం!

కనకయ్య పరమ బద్ధకస్తుడు. వేళ తప్పకుండా తిని మామిడి తోపుల్లో, గుళ్ళల్లో పడుకుని సాయంకాలానికి రచ్చబండ వద్ద చేరి కబుర్లు చెబుతూ కాలక్షేపం చేసేవాడు. తల్లిదండ్రులు వాణ్ణి గురించి ఆందోళన చెందేవారు. అయినా వాడికి చీమకుట్టినట్టు కూడా ఉండేదికాదు. ఇలా ఉండగా ఆ ఊరికి ఒక సాధువు వచ్చాడు. గ్రామస్థులందరూ ఆయన్ను దర్శించుకుని ఆశీస్సులు పొందారు. అయితే కనకయ్య మాత్రం సాధువు దరిదాపులకు వెళ్ళలేదు.

ఉన్నట్టుండి ఆ గ్రామంలో ఒక వదంతి బయలుదేరింది. ఆ గ్రామంలో పాపిష్టివాడు ఒకడున్నాడనీ, వాడివల్ల గ్రామానికే అరిష్టమనీ, వాడి పాపం కారణంగా రానున్న అమావాస్య నాడు వాడి తల్లిదండ్రులు అదృశ్యమైపోతారన్నదే దాని సారాంశం!

అందరూ భయాందోళనలతో ఆత్రుతగా ఎదురుచూసిన అమావాస్య రాత్రి కనకయ్య తల్లిదండ్రులు కనిపించకుండా పోయారు. దాంతో అందరిలోకీ పాపిష్టివాడు కనకయ్య అని ఊళ్ళో వాళ్ళందరికీ తెలిసిపోయింది. అందరూ వాణ్ణి చీడపురుగును చూసినట్టు చూడసాగారు. తల్లిదండ్రులు లేకపోవడంతో వాడికి తిండి కూడా కరువయింది. మరో మార్గం కనిపించక వాడు వెళ్ళి సాధువు పాదాలపై పడి, ''నేనేపాపమూ ఎరుగను. నాకెందుకీ దుస్థితి? కాపాడే భారం మీదే,'' అని వేడుకున్నాడు. ''బాధ్యతలు విస్మరించి సోమరిగా కన్నవాళ్ళ ఉసురు పోసుకోవడానికి మించిన పాపం ఏమున్నది? ఆ పాపమే నిన్ను పట్టి పీడిస్తున్నది. సోమరితనమే మనిషికి పెద్ద శాపం. దాన్ని వదిలించుకుంటే నీకు శుభం జరుగుతుంది,'' అన్నాడు సాధువు.

ఆ మాటతో కనకయ్యకు తప్పు తెలిసివచ్చి, ఒళ్ళొంచి పనిచేయడం మొదలుపెట్టాడు. క్రమంగా వాడి కష్టాలు తొలగిపోయాయి. కనకయ్య సోమరితనం వదిలిపోవడంతో పాపం నశించి వాడి తల్లిదండ్రులు తిరిగి ప్రత్యక్షమవుతారన్న వదంతి వ్యాపించింది. పౌర్ణమినాటి సాయంకాలం కనకయ్య తల్లిదండ్రులు ఆంజనేయస్వామి గుడి వెనక ప్రత్యక్షమయ్యారు. వాళ్ళను చూడడానికి గ్రామమంతా తరలివచ్చింది. ''అంతా స్వామి వారి లీల,'' అన్నారు కనకయ్య తల్లిదండ్రులు. వారి మాటలకు సాధువు మందహాసం చేశాడు. –మల్లారెడ్డి శంకరప్రసాద్





# సర్దుపాట్లు



చలమయ్య పాలేరు రాముడి ఒక్కగానొక్క కొడుకు శంకరం. వాడికి పదహారేళ్ళప్పుడు ఒక బైరాగి చెయ్యి చూసి, ''శంకరానికి రెండేళ్ళలో ప్రాణగండముంది. మీరిద్దరు మాత్రం తీర్థయాత్రలు చేసివస్తే ఆ గండం తప్పుతుంది,'' అని తల్లిదండ్రులకు చెప్పాడు.

పాలేరు దంపతులు కొడుకును చల మయ్య దంపతులకు అప్పజెప్పి, తీర్థయా త్రకు బయలుదేరారు. వాళ్ళు తిరిగి వచ్చేదాకా శంకరాన్ని జాగ్రత్తగా చూసుకుంటానని మాట ఇచ్చాడు చలమయ్య.

శంకరానికి ఇల్లు సర్దడమంటే మహా సరదా. అంత కాలం చిన్న గుడిసెలో ఉంటూ అస్తమానూ సర్దుతూండే శంకరం, చలమయ్య ఇల్లు చాలా పెద్దది కావడంతో రెచ్చిపోయి సర్దెయ్యడం మొదలుపెట్టాడు. దాంతో ఎప్పుడు చూసినా చలమయ్య ఇల్లు అద్దంలా మెరిసి పోతూ తీర్చిదిద్దినట్టుండేది. అదంతా శంకరం ప్రభావమేనని ఆ ఊళ్ళోనే కాకుండా, చుట్టు పక్కల గ్రామాలలోనూ గొప్పగా చెప్పుకో సాగారు.

అలా ఆ విషయం పొరుగూళ్ళో ఉండే ముసలయ్య ఇంటికి కూడా తెలిసింది. ముసలయ్య రోజూ తన ఇంట్లోవాళ్ళకు పురాణం చదివి వినిపిస్తాడు. కాని వినిపించాక చాప, వ్యాసపీఠం, పురాణ గ్రంథం తీసి దాచడు. ఆయన భార్య ఇంట్లో పిల్లలకు కొబ్బరాకు బూరాలు, తాటాకు బొమ్మలు, చేసి ఇస్తుంది. వాటికోసం తెచ్చినసరంజామాను అక్కడక్కడే వదిలేస్తుంది. ముసలయ్య కోడలు వంటకని వాడిన గిన్నెలు, గరిటలు మళ్ళీ తీసినచోట పెట్టదు. ఇల్లంతా చిందర వందరగా ఉందని విసుక్కుంటూ ఒకరినొకరు తప్పుపట్టేవారే గాని, సర్దే ప్రయత్నం చెయ్యరు. అలాంటి పరిస్థితుల్లో శంకరం గురించి తెలి యడంతో, ''కొన్నాళ్ళపాటు శంకరాన్ని మనిం టికిపంపమని చలమయ్యను అడుగు. ఆయన నీ స్నేహితుడే కాబట్టి కాదనరు. శంకరం చేత



మన పనిమనిషికి శిక్షణ ఇప్పిద్దాం,'' అన్నది ముసలయ్య భార్య.

ముసలయ్య సరేనని బయలుదేరి పొరుగూరు వెళ్ళి చలమయ్య ఇంటి తలుపుతట్టాడు. తలుపు తీసిన చలమయ్య కొడుకు గోపి, ''చాలా రోజుల తరవాత వచ్చారు. పెదనాన్నా! నాన్న బయటకు వెళ్ళాడు. రండి,'' అంటూ ఆయన చేతికర్ర అందుకుని పక్కన పెట్టాడు.

లోపల అడుగుపెడుతూనే తీర్చిదిద్దినట్టున్న ఇంటిని చూసి అదంతా శంకరం వల్లే అనుకుంటూ, మంచినీళ్ళు అడిగాడు ముసలయ్య. గోపి లోపలికి వెళ్ళి చెంబుతో వచ్చి, ''లోటా కనిపించడం లేదు పెదనాన్నా. పెరట్లో మందారమొక్క దగ్గర దోసిలిపట్టారంటే, ఒకేసారి మీకూ, మొక్కకూ దాహం తీరుతుంది,'' అన్నాడు.

ముసలయ్య పెరట్లో మంచినీళ్ళు తాగుతూ మొక్క మొదట్లోకి చూసి, ''ఇలాగుంటే నీరు పీల్చదు. నేలను తవ్వి గుల్ల చెయ్యాలి,'' అన్నాడు.

''అవును, గునపం కనించగానే ఆ పనే చెయ్యాలనుకుంటున్నాం,'' అన్నాడు గోపి.

ముసలయ్య ఓసారి పెరడంతా కలయజూసి, ''అద్దంలా ఉంది అంతా శంకరం మహిమే కాబోలు,'' అనుకుని తరవాత గోపితో, ''అమ్మేదిరా. ఇంట్లో లేదా?'' అన్నాడు.

''వంట చేస్తోంది పెదనాన్నా!'' అంటూ గోపి చెంబును వంటింట్లో ఉంచడానికి వెళితే, తనూ అక్కడికి వెళ్ళాడు ముసలయ్య. గోపి తల్లి పంచె, చొక్కాతో వంట చేస్తుంటే ఆశ్చర్యంతో అలాగే చూస్తూండిపోయాడాయన. ''నా బట్టలు కనిపించకపోతే ఆయనవి వేసుకున్నాను,'' అన్నది గోపి తల్లి.

ఆ తరవాత ఆమె, ''పెదనాన్నకు మడత మంచం వేయి. కాస్సేపు విశ్రాంతి తీసుకుంటారు,'' అన్నది గోపితో. మండువాలోకి వచ్చిన ముసలయ్యతో, ''మడత మంచం కనిపించడం లేదు. చాప పరిచేదా పెదనాన్నా?'' అన్నాడు గోపి. ''ఇందాకట్నుంచి గమనిస్తున్నా. ఇంట్లో అవసరమైన ఏ వస్తువూ కనిపిస్తున్నట్టు లేదే!'' అన్నాడు ముసలయ్య.

''అవును, పెదనాన్నా. మా ఇంట్లో శంకరం అని ఒక కుర్రాడు చేరాడు. వాడికి ఎప్పటికప్పుడు ఇల్లు సర్దడం మహా సరదా. అంతవరకు బాగానే ఉంది కానీ, ఏది ఎక్కడ దాచాడో వాడికి గుర్తుండదు. మాక్కనబడదు. వాడు

వద్దన్నా సర్దడం మానడు. మానకపోయినా వాడి అమ్మ, నాన్న వచ్చేదాకా పొమ్మనలేం,'' అంటూ శంకరం కథ చెప్పాడు గోపి.

''ఏం సర్దినా ఇంట్లోనే పెడతాడు కదా? సర్దిన వస్తువు కనపడకుండా ఎక్కడికి పోతుంది,'' అన్నాడు ముసలయ్య నమ్మలేనట్టు.

''ఏదీ ఎక్కడికీ పోదు. అవసరానికి కనబడదంతే,'' అన్నాడు గోపి.

''మీ నాన్న కనిపించడం లేదు. అతణ్ణి కూడా శంకరమే దాచేశాడంటావా ఏంటి?'' అన్నాడు ముసలయ్య నవ్వుతూ.

''ఏం చెప్పేది పెదనాన్నా! వంటసమయంలో వాడు పక్కన ఉంటే ఏమేం మాయం చేస్తాడో అని రోజూ ఈ సమయంలో వాణ్ణి బయటికి తీసుకుపోవడం రివాజయింది,'' అన్నాడు గోపి.

అంతలో చలమయ్య శంకరంతో తిరిగి వచ్చి మిత్రుణ్ణి చూసి ఆప్యాయంగా పలకరించాడు. భోజనాలయ్యేలోగా ఇంట్లో ఇంకా చాలా వస్తువులు కనిపించకపోవడం గమనించిన ముసలయ్య కలవరపడ్డాడు. అది గమనించిన చలమయ్య, ''మా పాలేరు, శంకరంతో కొన్నాళ్ళు సర్దుబాటు చేసుకోమని కోరాడు. కానీ శంకరం అదే పనిగా సర్దేస్తూండడం వల్ల మావి సర్దుపాట్లు అయ్యాయి. అవి తప్పాలంటే శంకరాన్ని కొన్నాళ్ళపాటు ఎవరికైనా అప్పజెప్పాలని ఉంది. నీ ఎరుకలో మన శత్రువెవరైనా ఉంటే చెప్పు,'' అని నవ్వి, ''ఇంతకీ ఊరకరారు మహాత్ములు. నువ్వొచ్చిన పనేంటో చెప్పు,'' అన్నాడు.

ముసలయ్య, ''నేను మహాత్ముణ్ణి కాను కదా. అందుకే ఊరకే నిన్ను చూసిపోదామని వచ్చాను. ఇక వస్తాను,'' అంటూ లేచాడు.

ముసలయ్య తిరుగు ప్రయాణమైతే ఆయన చేతికర్ర కనిపించలేదు. అయినా దాన్ని గురించి బాధపడకుండా సంతోషంగా ఇల్లు చేరాడు. అప్పుడు తన ఇంట్లో చెల్లాచెదరుగా ఉన్న వస్తువులను చూసి, ''అన్నీ కనిపిస్తున్నాయిగా. సర్దుపాట్ల కంటే ఇలా సర్దుబాటు చేసుకోవడమే మంచిది,'' అనుకున్నాడాయన.

– జొన్నలగడ్డ రామలక్ష్మి



# కరూన్ మూర్తి

రండి... రండి... అతి పిన్న వయసు అత్యంత వేగవంతుడైన కరూన్ మూర్తిని కలుసుకుందాం! ఆరేళ్ళ ప్రాయంలోనే ఈ బుడతడు ప్రతిష్ఠాత్మకమైన 'ఇండియన్ వాలెంటినో రోస్సీ' బిరుదును అందుకున్నాడు. ''స్పీడ్ రేసింగ్, బైకు మీద స్టంట్స్ ఈ రెండూ నా కిష్టమే,'' అంటాడీ చెన్నయ్‌కి చెందిన చిచ్చరపిడుగు! బైకు నడపడం ఎప్పుడు ప్రారంభించాడంటారా? నాలుగేళ్ళ ప్రాయంలో! ''నేనెంతో ఎగ్జయిటింగా ఫీలయ్యాను. మొట్టమొదట బైకు మీద కూర్చున్నప్పుడు కూడా భయపడలేదు!'' అంటాడు కరూన్.

నెలలో రెండు మూడు సార్లు శ్రీపెరుంబుదూర్ ఇరుంగాట్టు కోట్టయ్ రేస్ ట్రాక్‌కు వెళతాడు. రోజంతా దాదాపు మూడు సెషన్స్ ప్రాక్టీస్ చేస్తాడు. బైకింగ్‌లో ఫార్మల్ ట్రెయినింగ్ కోసం అతణ్ణి జపానుకు పంపాలని అతడి తండ్రి ఆశిస్తున్నాడు. ఆపదలు నిండిన క్రీడే అయినప్పటికీ, కరూన్‌ను ప్రోత్సహించడానికి అతడి తల్లిదండ్రులు వెనుకాడడం లేదు.

ఇప్పటికే ఆటో మొబైల్ రేసింగ్‌లో కరూన్ చాలా ప్రసిద్ధుడైపోయాడు. స్పాన్సర్ల మద్దతు గనక లభిస్తే కరూన్ బైకింగ్ స్టార్ కాగలడనడంలో సందేహం లేదు!

'ఇండియన్ వాలెంటినో రోస్సీ'కి చందమామ అభినందనలు తెలియజేస్తున్నది!



- ఆర్క్యుట్‌లో కరూన్‌కు 150 మంది అభిమానులున్నారు! అతడి కమ్యూనిటీ పేరు 'ఇండియన్ వాలెంటినో రోస్సీ.'
- ఒక యమహా ఆర్ 15, ఒక హోండా సిబిఆర్ 110సీసీతో సహా అతనికి 6 పాకెట్ బైక్స్ ఉన్నాయి.
- అతడు ఏ వంటయితే ఇష్టంగా తింటాడో తెలుసుకోవాలని ఉన్నదా? దోసెలు!

సాధించిన విజయాలు:
- ఆరేళ్ళ కరూన్ ఇండియాలో అతిపిన్న వయసు రేసెర్!
- సిఎన్ఎన్ఐబిఎన్ అతణ్ణి ఎంగెస్ట్ కార్టింగ్ కిడ్‌గా ప్రకటించింది.
- కరూన్ ఆసియాలోనే అతి పిన్నవయసు స్టంట్ పర్‌ఫార్మర్ కూడా.
- రోలోన్ అండ్ యుసిఎఎల్ అండ్ యమెరో 2008లో ''ఇండియన్ వాలెంటినో రోస్సీ'' బిరుదుతో అతణ్ణి సత్కరించింది.

# చందమామ కబుర్లు

## వండలూర్ జూలో తెల్ల పులులు

ఒరిస్సాలోని నందన్ కానన్ జూ(ప్రపంచంలో కెల్లా తెల్లపులుల నివాసమైన అతిపెద్ద జంతు ప్రదర్శనశాల)లో మీరు తెల్లపులులను చూశారా? అక్కడ చూడలేదంటే చెన్నయ్‌కి దక్షిణంగా 35కి.మీ. దూరంలో ఉన్న వండలూర్ జూలోని అరిజ్ఞర్ అణ్ణా జువలాజికల్‌పార్క్‌లో తెల్లపులులను చూడవచ్చు. ఆగ్నేసియాలోకెల్లా అతి పెద్ద జంతు ప్రదర్శనశాలగా దీన్ని చెబుతారు. తమిళనాడులో తెల్లపులుల జంట ఉన్న జూ ఇదొక్కటే. ఇప్పుడు వాటికి పిల్లలు కలగడంతో అదనపు ప్రత్యేకతను కూడా సంతరించుకున్నది.

అనసూయ అనే ఐదేళ్ళ ఆడపులి మూడు పిల్లలను ఈని చరిత్ర సృష్టించింది. పిల్లలను ఈనడానికి 104 రోజులు తీసుకున్నది. నిర్వాహకులు రెండు డిజిటల్ వీడియో కెమెరాలను అమర్చి, దాన్నంతా వివరంగా ఫొటోలు తీశారు. పులి కూనల్ని వేడి నుంచి కాపాడ్డానికి నీళ్ళల్లో తడిపిన గోనెసంచులను పరిచారు. వాటికి రోజుకు 7కి.గ్రా. గొడ్డుమాంసం అందించారు.







## భూగర్భ గుహాలలో నివసించే ప్రజలు

టునీసియా రాజధానికి 450 కి.మీ. దక్షిణంగా మట్మటా అనే చిన్న గ్రామం ఉంది. ఇక్కడి ప్రజలు భూమిలోకి నిటారుగా గోతులు తవ్వి వాటిలో నివసిస్తున్నారు. ఈ ఇళ్ళల్లో వేసవి లోనూ, చలికాలంలోనూ 20-22 డిగ్రీల సెల్సియస్ మధ్య ఉష్ణోగ్రత ఉంటుంది.

ఈ మట్మటా గ్రామం గతవెయ్యేళ్ళుగా ఉన్నప్పటికీ 1967వసంవత్సరంలో 22 రోజుల పాటు ఎడతెరిపిలేకుండా కురిసిన వర్షాల కారణంగానే దీన్ని గురించి బయటి ప్రపంచానికి తెలియ వచ్చింది. ఈ భూగర్భ గృహాలను వెల్లువ ముంచెత్తడంతో ఆ గ్రామవాసులు అధికారుల సాయం కోరవలసిన నిర్బంధం ఏర్పడింది. ఆ సమయంలో చాలా ఇళ్ళు నాశనమైపోయాయి. ఉపరితలంలో ఇళ్ళు నిర్మించబడ్డాయి. ప్రస్తుతం 100 భూగర్భ గృహాలు మాత్రమే ఉన్నాయి. అయినా వీటిని చూడడానికి రోజూ వందలాది పర్యాటకులు వస్తూ ఉంటారు.

# క్రీడా జ్యోతి

## అవును, మనం చేయగలం!

మారుమూల గ్రామంలో పుట్టిపెరిగిన ఓ అమ్మాయి. సరైన పోషకాహారం, కనీస వసతులు, కనీసం స్పైక్‌షూస్ కూడా లేవు. క్రీడల్లో ఎలాంటి శాస్త్రీయ పరిజ్ఞానం, సాయం అందుబాటులో లేదు. అయినా ఒలింపిక్ మెడల్ అందుకోగలదా? అసాధ్యం అనుకుంటున్నారు కదూ? అలాంటి అసాధ్యాన్ని సుసాధ్యం చెయ్యాలన్న సంకల్పంతోనే ఉష స్కూల్ ఆఫ్ అథ్లెటిక్స్ స్థాపించబడింది!

''మనకు శక్తిసామర్థ్యాలు ఉన్నాయి. పట్టుదల ఉంది. టెక్నాలజీ ఉంది. నిపుణులున్నారు. మనదేశం దాన్ని సాధించగలదు!'' అని ఉద్ఘాటిస్తోంది పయ్యోళి ఎక్స్‌ప్రెస్ పిటి ఉష! ''మనం చేయగలమా?'' అన్నదాన్ని ''మనం చేయగలం!'' అని మార్చడమే ఆమె నడుపుతూన్న అకాడెమీ ఆదర్శం!

యువక్రీడాకారులను తమ శక్తి సామర్థ్యాలను పరిపూర్ణంగా వినియోగించుకునేలా అభివృద్ధి పరిచే లక్ష్యంతో 2002వ సంవత్సరంలో, పరుగుల రాణి పిటి ఉష స్కూల్ ఆఫ్ అథ్లెటిక్స్‌ను ప్రారంభించింది.

పిటి ఉషను కొత్తగా పరిచయం చెయ్యవలసిన అవసరం లేదు. పలువురు క్రీడాకారులకు పట్టుదలకు చిహ్నంగా, స్ఫూర్తిప్రదాతగా భాసిల్లుతూన్న గోల్డన్ గర్ల్ ఉష. అనారోగ్యం, పేదరికం అవరోధాలను అధిగమించి, తన ఇరవైయవ యేటనే ఒలింపిక్స్‌లో అడుగుపెట్టిన తొలి భారతీయ క్రీడాకారిణి! 101 అంతర్జాతీయ అవార్డులను అందుకున్న ఆమెను భారత ప్రభుత్వం పద్మశ్రీ, అర్జున అవార్డులతో సత్కరించింది.

1984 లాస్ ఏంజెలెస్ ఒలిపిక్స్‌లో 1/100వ సెకనులో కాంస్యపతకం చేజారిన క్షణమే ఉష మనసులో అథ్లెటిక్స్‌కు ఒక శిక్షణా కేంద్రం ఏర్పాటు చెయ్యాలన్న బలమైన కోరిక ఏర్పడింది. తను కొద్దిలో కోల్పోయిన పతకాలను యువక్రీడాకారులు పొందాలని ఆమె కలలు కనసాగింది. 2000వ సంవత్సరంలో 36వ యేట రిటైరైనప్పటి నుంచి యువ క్రీడాకారులను ప్రోత్సహించడం మొదలుపెట్టింది.



కేరళ రాష్ట్ర ప్రభుత్వం ఉదారంగా ఇచ్చిన నగరం శివార్లలోని 30 ఎకరాల ప్రాంగణంలో ఈ శిక్షణా కేంద్రం నెలకొల్ప

సానియాకు వింబుల్డన్ దక్కేనా telugu.chandamama.com స్పోర్ట్స్ ట్రివియా చదవండి

బడింది. ఇక్కడ అంతర్జాతీయ ప్రమాణాలతో 40 మంది క్రీడాకారులు బస చేయడానికి తగిన హాస్టల్ సదుపాయం, 800మీ. 8 లేన్ ట్రాక్, జిమ్నాజియం, వైద్య, రవాణా సదుపాయాలు ఉన్నాయి. అవసరాల్లో ఆదుకునే ఉదారవంతులైన స్పాన్సర్లు ఆర్థిక సాయం కారణంగా ఈ సౌకర్యాలన్నీ యువ క్రీడాకారులకు ఉచితంగా సమకూర్చబడుతున్నాయి.



అంతర్జాతీయ నిపుణుల సలహా ప్రకారం అధ్యయన విధానం, ఆహారం, దృక్పథనిర్మాణం మొదలైనవి జాగ్రత్తగా, ప్రణాళికాబద్ధంగా రూపొందించబడుతున్నాయి. ట్రెయినింగ్ షెడ్యూల్‌కు సంబంధించినంతవరకు యువఛాంపియన్ల మానసికదృక్పథాన్నే ముఖ్యంగా పరిగణనలోకి తీసుకుంటారు. ''మొదట ఆడండి, ఆ తరువాత శిక్షణ పొందండి, చిరునవ్వుతో శ్రమించి గెలుపొందండి!'' అంటారు ఉష.

ప్రస్తుతం ఈ స్కూల్లో 12-19 ఏళ్ళ మధ్య వయస్కులైన పదహారు మంది యువతులు ఉన్నారు. మామూలుగా ఈ స్కూల్లో మగ పిల్లలను చేర్చుకోరు కాని, 800 మీటర్లలో జాతీయస్థాయి ఛాంపియన్, జూనియర్ కేటగిరిలో 1200మీ. ఛాంపియన్ అయిన డిబిన్ డేవిస్ ఇక్కడ శిక్షణ పొందుతున్నాడు. ఆసియా క్రీడలలో ప్రత్యేక ప్రతిభను కనబరచిన స్టార్ పెర్ఫార్మర్లు టింటూ, లూకా, కె.ఎ. సోనియా కూడా ఇక్కడ ఉన్నారు. ఇటీవల రాష్ట్ర 18 ఏళ్ళలోపు ప్రతిష్ఠాత్మకమైన ఎం.కె. జోసెఫ్ మెమోరియల్ ఆరవ ఇంటర్ క్లబ్ అథ్లెటిక్స్ ఛాంపియన్‌షిప్ రికార్డును బద్దలు కొట్టిన 17 ఏళ్ళ ఎం.ఎస్. దర్శన పిటి ఉష విద్యార్థిని కావడం విశేషం! ఈ స్కూల్లో చీఫ్ కోచ్ పరుగుల రాణి పి.టి. ఉష! యువ క్రీడాకారిణులకు అత్యధికమైన ప్రయోజనం సమకూరే విధంగా ఆమెకు అసిస్టెంట్ కోచ్ కూడా ఉన్నది.

సరైన జ్ఞానం, అంకితభావం, ఓర్పు, కఠోర శ్రమ ఈ మూడూ మంచి కోచ్‌కు ఉండాలంటారామె.

ఉష స్కూల్ ఆఫ్ అథ్లెటిక్స్ భారత దేశానికి ఎన్నో విజయాలను సాధించడానికి సమాయత్తమవుతోంది. మీరు ప్రొఫెషనల్ అథ్లెట్ కావాలనుకుంటున్నారా? వెంటనే పయ్యోళి ఎక్స్‌ప్రెస్‌ను సంప్రదించండి. ఉష కలతో చేయి కలపండి!

మరిన్ని వివరాలకు:
వెబ్ చిరునామా: www.ptusha.org లేదా
www.ptusha.com
టెలిఫోన్ నెం: 0496 2645811/2645812
మొబైల్ నెం: 09846202345
ఈ-మెయిల్: ushaschool@rediffmail.com
చిరునామా: ఉష స్కూల్ ఆఫ్ అథ్లెటిక్స్,
కీనలూర్, బాలుస్సేరీ,
కోళిక్కోడ్ జిల్లా, కేరళ.

# ఛియర్ లీడింగ్



తొలి రోజుల్లో ఛియర్ లీడర్స్ అందరూ పురుషులే అన్న విషయం మీకు తెలుసా? అమెరికాలో ఛియర్ లీడింగ్ ప్రారంభ దశను పరిశీలించామంటే 1880 దాకా వెళుతుంది. తాము మద్దతు తెలిపే టీమ్‌ను ఉత్సాహపరచడానికి ప్రేక్షకులు ఉత్సాహంతో నినాదాలు చేసేవారు. 1898లో మిన్నెసోటా విశ్వవిద్యాలయ విద్యార్థి జానీ క్యాంప్ బెల్ స్టేట్ ఫుట్‌బాల్ టీమ్‌ను ఉత్సాహపరిచే ఆలోచనకు నాంది పలికాడు. అసంఖ్యాక అభిమానులు మద్దతు పలికినప్పటికీ టీమ్ ఓడిపోయింది! అయితే మిన్నెసోటా 1903లో మొట్ట మొదటి మేల్ ఛియర్ స్క్వాడ్‌ను ఏర్పాటు చేసింది. నూతన వినోద క్రీడ ఆరంభమయింది.

1923లో స్త్రీలు పాల్గొనడం ప్రారంభించడంతో ఛియర్ లీడింగ్ జిమ్నాస్టిక్స్‌గానూ, టంబ్లింగ్‌గానూ పరిణతి చెందసాగింది. త్రోస్, పిరమిడ్స్ పరిచయం చేయబడ్డాయి. ఛియర్ లీడర్స్ శారీరక దారుఢ్యంతో పాటు సమన్వయ శక్తీ, ఫ్లెక్సిబిలిటీ కలిగిన అథ్లెట్స్ అయ్యారు. ఈనాడు కళాశాలల స్థాయిలో 50శాతం మంది పురుషులు ఉన్నప్పటికీ ప్రపంచం మొత్తం మీద 97శాతం ఛియర్ లీడర్స్ స్త్రీలే. ఎందరో నటులు, సంగీతకారులు, వివిధ రంగాలకు చెందిన ప్రముఖులు ఛియర్ లీడర్స్‌గా ఉన్నారు. అలాంటి వారిలో మాడొన్నా, జార్జ్‌బుష్ మొదట చెప్పుకోతగ్గవారు.

1930లలోనూ ఆ తరవాతా ఛియర్‌లీడింగ్ వినోదప్రదంగా రూపొందింది. ఫ్రెడ్‌గెస్టాఫ్ రూపొందించిన వినిల్ పామ్-పామ్, అభిమానులను ఆకర్షించడానికి ఎంతగానో ఉపయోగపడింది. ప్రేక్షకులను ఉత్సాహపరిచి వాళ్ళ దృష్టిని ఆకర్షించడానికి మెగాఫోన్లు అదనపు ఆకర్షణగా పరిణమించాయి.

ఛియర్ లీడర్స్ ఆధారంగా రూపొందించిన పాత్రలు కొన్ని హాలీవుడ్ చిత్రాలు, టీవీ షోలు, నిన్టెండో లాంటి వీడియో గేమ్స్‌లో వచ్చాయి!

ఫుట్‌బాల్ తప్ప తక్కిన బాస్కెట్‌బాల్, సోసర్, ఐస్ హాకీ, వాలీబాల్, బేస్‌బాల్, రెజ్లింగ్, మిలిటరీ అకాడెమీలతో సహా అప్పుడప్పుడు ఛియర్‌లీడింగ్ స్క్వాడ్స్ స్పాన్సర్స్ కలిగి ఉంటున్నాయి. దక్షిణాఫ్రికాలో జరిగిన ఐసిసి ట్వెంటీ 20 క్రికెట్ వరల్డ్ కప్ ఛియర్ లీడర్స్‌ను కలిగిన మొట్టమొదటి అంతర్జాతీయ క్రికెట్ ఈవెంట్.

ఇవాళ ప్రపంచ వ్యాప్తంగా ఛియర్ లీడింగ్ ఒక వినోద క్రీడగా గుర్తింపబడి ఉంది. అమెరికాలో 1.5 లక్షల మంది, ఆస్ట్రేలియా, చైనా, యు.కె. యూరప్‌లలో లక్ష మందికి పైగా పాలుపంచుకుంటున్నారు.

క్రికెట్‌లో పొట్టివాళ్ళదే రాజ్యమట telugu.chandamama.com క్రికెట్ ట్రివియా చదవండి

# వార్తలలో బాలలు

## ఆస్కార్ మార్చిన జీవితాలు



స్లమ్‌డాగ్ మిలియనీర్ సినిమాలో నటించిన బాల నటులు అజారుద్దీన్ ఇస్మాయిల్, రుబీనా రఫీక్ కలలు నిజమయ్యాయి. వాళ్ళిద్దరూ ముంబయి, బంద్రా ఈస్ట్ గరీబ్‌నగర్ మురికివాడలో ఉంటున్నారు. వాళ్ళు ఆస్కార్ సత్కారం పొందిన ఆ చిత్రంలో చిన్నప్పటి కథానాయిక, నాయకులుగా నటించడంతో- 81వ ఆన్యువల్ అకాడెమీ అవార్డ్స్ కార్యక్రమంలో పాల్గొనడానికి అమెరికా వెళ్ళారు.

స్లమ్‌డాగ్ మిలియనీర్ ఎనిమిది ఆస్కార్ అవార్డులను కైవసం చేసుకున్నది. ఈ విజయం సాధించిన చిత్రంలో నటించిన ఆ పిల్లలిద్దరికీ చెరొక ఫ్లాట్ ఇవ్వాలని మహారాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. రుబీనా తండ్రి రఫీక్ ఒక వడ్రంగి; అజారుద్దీన్ తండ్రి ఇస్మాయిల్ పాత కర్రసామానుల వ్యాపారం చేస్తున్నాడు.

## రాష్ట్రపతి నుంచి కానుక!

రాష్ట్రపతి నుంచి కానుకగా ఉంగరం అందుకోవడం అంటే మామూలు విషయం కాదు కదా! తమిళనాడు మదురైకి చెందిన ఎం.లవిన శ్రీ - రాష్ట్రపతి శ్రీమతి ప్రతిభాపాటిల్ జనవరి రెండవ వారం చెన్నయ్ పర్యటనకు వచ్చేప్పుడు తనను చూడాలనుకుంటున్నారని కబురు అందగానే ఆనందంతో ఉబ్బితబ్బిబ్బయింది. తల్లిదండ్రులతో ఈ ఎనిమిదేళ్ళ అమ్మాయి ఉత్సాహంతో చెన్నయ్‌కి బయలుదేరింది. ''నువ్వొక జాతీయ సంపద,'' అని అభినందిస్తూ ఒక ఉత్తరం, ఉంగరం, పదకొండు వేల రూపాయల నగదు బహుమతి అందజేశారు రాష్ట్రపతి. ఇంతటి గౌరవం అందుకోవడానికి ఆ అమ్మాయి సాధించిన గొప్ప కార్యం ఏమిటని అడుగుతున్నారా? సుప్రసిద్ధ తమిళ నీతిగ్రంథం తిరుక్కురళ్‌లోని మొత్తం 1,330 ద్విపదలను 2005లోనే కంఠతా పట్టింది! అందుకని ఆమెకు 2006లో 'నేషనల్ చైల్డ్ అవార్డు' ఇచ్చారు కూడా.





# హాస్యకథ



## కొత్త అలారం గడియారం

ఓ సుడిగాలి దూసుకు వచ్చినట్టయింది. టీనా మళ్ళీ క్లాసుకు ఆలస్యంగా వచ్చింది. ఆమె జుట్టు అన్ని వైపులకూ ఎగురుతోంది. రొజుతూ రొప్పుతూ, ''స్కూల్ బస్సు మిస్సయ్యాను,'' అన్నది టీనా.

''మరెప్పుడూ ఆలస్యం కాకూడదు,'' హెచ్చరించింది ఇంగ్లీష్ టీచర్ మిస్ సుదీప్త.

''సారీ.. మేడం...'' అన్నది టీనా మెల్లగా.

''పిల్లలూ! గ్రామర్ పాఠ్యపుస్తకాలు తెరవండి.''

టీనా వెళ్ళి కూర్చున్నది.

''నీ దగ్గర అలారం క్లాక్ ఉంది కదా?'' టీనాను అడిగింది దీప.

''ఏం ప్రయోజనం! మా నాన్నా, తమ్ముడూ నా గదిలోకి వచ్చి పిలుస్తారు..''

''ఇంత జరుగుతున్నా నువ్వు నిద్రపోతూనే ఉంటావా?'' అని అడిగాను కాస్త ఈర్ష్యతో.

''అవును,'' అన్నది టీనా యథాలాపంగా.

మిస్ సుదీప్త చూపులు మామీద పడ్డాయి.

''అజయ్, ప్యాసివ్-యాక్టివ్ వాయిస్‌ల గురించి సందేహాలేవైనా ఉన్నాయా?'' అని అడిగిందామె.

''లేదు మేడమ్. నన్ను వదలిపెడితే చాలు,'' అన్న కంఠస్వరం నాలో లీలగా ప్రతిధ్వనించింది.

''టీనా గ్రామర్ రాయడానికి పెన్సిల్‌ను ఎందుకు అలా అడ్డదిడ్డంగా ఆడిస్తున్నావు?'' అని అడిగింది టీచర్.

టీనా హడావిడిగా సుడోకును మరో పేజీ కిందికి దోపేసింది.

''టీనా, నిన్ను మూడో బెంచి నుంచి మొదటి బెంచీకి మార్చడం మంచిదనుకుంటాను,'' అన్నది టీచర్.



టీనా రాయడం పూర్తి చేసి నోటు పుస్తకాన్ని టీచర్ చేతికిచ్చింది.

ఆ రోజు సాయంకాలం మేము టీనా ఇంటికి వెళ్ళాం. మమ్మల్ని చూడగానే టీనా వాళ్ళమ్మ నవ్వుతూ, ''రండి.. రండి.. కూర్చోండి. వేడి వేడి సమోసాలు తెస్తాను,'' అంటూ మమ్మల్ని లోపలికి పిలిచింది.

దీప ఇంటినంతా పరిశీలనగా చూస్తూ, ''టీనాకు గురువారం పుట్టిన రోజు కదా. అలారం క్లాక్ కానుకగా ఇస్తే ఎలా ఉంటుంది?'' అని అడిగింది.

‘‘ఊహూ.. వద్దు. టీనా వద్ద ఇప్పటికే ఒకటి ఉంది!’’

‘‘అయినా, జిగ్‌సా అలారం క్లాక్ లేదుకదా?’’

దీపా ఆ గడియారం గురించి మరో ఐదు నిమిషాలు వివరించింది. ‘‘చాలా బావుంది. దాన్నే కొని ఇద్దాం,’’ అన్నాన్నేను.

అమర్‌బజార్‌లోని షాపులన్నీ వెతికి మాకు కావలసిన గడియారం కొని తీసుకెళ్ళి ఇచ్చాం.




‘‘అలారం క్లాక్? నేను చేయవలసిందల్లా స్నూజ్ నొక్కడమే!’’ అన్నది టీనా నవ్వుతూ.

‘‘ఇది మామూలు గడియారం కాదు. మొదట టైమ్ సెట్ చెయ్. రేపు నువ్వు మా కందరికన్నా ముందు క్లాసులో ఉంటావు!’’ అన్నాన్నేను.

బ్రహ్మాండమైన మా ఆలోచనకు టీనా తల్లి మురిసిపోవడం నేను గమనించాను. ఆమె మమ్మల్ని మనసారా మెచ్చుకున్నది కూడా.

‘‘నిద్రమహారాణికి ఇదో సవాలు,’’ అన్నది టీనా పెదవులు బిగించి తలాడిస్తూ.

మరునాడు ఉదయం సరిగ్గా ఆరు గంటలకు గడియారం కార్యాచరణకు దిగింది. నాలుగు పజిల్‌పీసెస్ గదిలో ఎక్కడెక్కడో పడి ఉన్నాయి. టీనా నిద్రకళ్ళతో లేచి గడియారాన్ని నొక్కింది. ఫలితం కనిపించలేదు. పిడికిలి బిగించి ఒక్క గుద్దు గుద్దింది. అయినా అలారం ఆగకుండా మోగుతూనే ఉంది. అది కొత్త అలారం గడియారమన్న సంగతి ఆమెకు అప్పుడు గుర్తుకొచ్చింది. కళ్ళు నులుముకుని తెరిచి చూసింది. పజిల్ పీస్ పడక మీద ఉన్నది. దాన్ని చూడగానే గడియారం కుట్ర పథకం అర్థమై గట్టిగా నొక్కింది. ఎలాగైనా గీపెట్టడం ఆపాలన్నది ఆమె తాపత్రయం. అయినా అలారం ఆగకుండా మోగుతూనే ఉంది. ఆమె పడకపై నుంచి కిందికి ఉరికి మరో మూడు పీసెస్ కోసం వెదకసాగింది!

అంతలో టీనా అన్నయ్య ఆశు ఆమె గదిలోకి వస్తూ, ‘‘ఆ శబ్దం కాస్త ఆపుతావా?’’ అన్నాడు.

‘‘అందుకోసమే ప్రయత్నిస్తున్నాను. రా తక్కిన మూడు ఫజిల్ పీసస్ నీకు దొరుకుతాయేమో చూడు. నా దగ్గర రెడ్‌పీస్ ఉంది,’’ అన్నది టీనా దీనంగా. ఆశు పళ్ళు పటపట లాడిస్తూ గదంతా వెతికి కప్‌బోర్డ్ దగ్గర ఒక బ్లూ పీస్ తీశాడు. ఈలోగా టీనా తల్లి అక్కడికి వచ్చింది. ‘‘ఎక్కడున్నాయేంటి?’’ అంటూ వెతకసాగింది. మరికొంత సేపటికి, ‘‘ఏమయింది టీనా..’’ అంటూ టీనా తండ్రి అక్కడికి వచ్చాడు. కుటుంబం కుటుంబమంతా గదిని గాలించసాగింది.

‘‘దాన్ని ఆపడానికి మరో మార్గం లేదా?’’

‘‘లేదు,’’ అన్నది టీనా.

''దాన్ని పగలగొట్టు.''

''వద్దు వద్దు. అది గిఫ్ట్‌గా వచ్చింది!''

టేబుల్ కింది ఉన్న ఎల్లో పీస్‌ను కనిపెట్టే శాడు ఆశు.

''నాకొకటి దొరికిపోయింది,'' అని ప్రక టించాడు తండ్రి గ్రీన్‌పీస్ చూపిస్తూ పెద్ద లాటరీ తగిలినంత సంబరంతో.

అదో అద్భుతమైన దృశ్యం. వణుకుతున్న చేతులతో పీసెస్‌ను ఒకటిగా బిగించి గడియారం మీద అమర్చారు. అలారం మోగడం ఆగిపో యింది. అందరూ ఆనందంతో ఊపిరి పీల్చుకు న్నారు. అదీ ఒక్క క్షణమే. గడియారంలో టైమ్ చూస్తే ఏడుగంటలు!



''ఇంకా వంట కాలేదు.''

''ఇంకా స్నానం చెయ్యలేదు.''

''నా బాస్కెట్‌బాల్ ప్రాక్టీస్... ఛ ఛ...''

ఇంత అద్భుతమైన ఏర్పాటు చేసి కూడా టీనా ఇంకా రాలేదేమిటా అని స్కూల్లో ఆశ్చ ర్యంతో ఎదురుచూడసాగాం. మామూలుకన్నా గంట ఆలస్యంగా వచ్చిన టీనా మాకేసి కోపంగా చూస్తూ వెళ్ళడం ఇంకా ఆశ్చర్యం కలిగిం చింది.

ఆ రోజు మాకు వ్యాసరచన పరీక్ష!

''..టీనా ఇవాళ స్కూలుకు ఎందుకు ఆల స్యంగా వచ్చావో చెబుతూ 1000 పదాలతో వ్యాసం రాయాలి, ఇవాళ నేను నీ వ్యవహారం చూస్తాను,'' అన్నది మిస్ సుదీప్త.

ఇంటర్‌వల్ సమయంలో జరిగిన అసలు సంగతి తెలుసుకుని దిగ్భ్రాంతి చెందాము. టీనా తల్లికి కోపం వస్తే మాకు వేడివేడి సమో సాలు దొరకవు కదా! ఆలోచించడానికే భయం వేస్తోంది.

అయినా మరునాడు ఉదయం మిస్ సుదీప్త ఆనందకరమైన పరిష్కారంతో కథకు సుఖాంతం పలికింది(నేను ఆమెకు నమస్కరించాలనుకు న్నాను).

''టీనా నువ్వు రాసిన 'జిగ్‌సా క్లాక్' నిజం గానే చాలా సృజనాత్మకమైన వ్యాసం. చాలా బావుంది! అద్భుతమైన కల్పన. నీకు ఎ ప్లస్!'' తెగ మెచ్చుకున్నది మిస్ సుదీప్త.

టీనా మమ్మల్ని చూసి సంతోషంతో నవ్వుతూ, ''మా ఇంటికి రండి. అమ్మ ఖీర్ తయారు చేస్తోంది!'' అన్నది.

సంతోషంతో ఎగిరి గంతేసినట్టయింది!

– రమా రమేష్



# నవ్వుల పువ్వులు



రాహుల్, రాణి ఏం ఆట ఆడుదామా అని ఆలోచిస్తున్నారు. ''డాక్టర్ ఆట ఆడుకుందామా?'' అని అడిగాడు రాహుల్. ''చాలా బావుంటుంది. నువ్వు ఆపరేషన్ చెయ్. నేను కేసు పెడతాను,'' అన్నది రాణి.



టీచర్: కరణ్, నువ్వెందుకు హోమ్‌వర్క్ చెయ్యలేదు?

కరణ్: క్షమించండి టీచర్.

టీచర్: 'క్షమించండి' అనే మాట నా డిక్షనరీలో లేదు.

కరణ్: లైబ్రరీలోని డిక్షనరీలో తప్పకుండా ఉంటుంది టీచర్.



మనీషా పిల్లలతో కలిసి తోటలో ఆట్లాడుతూ ఒళ్ళంతా బురద పూసుకున్నది. ఆ తరవాత ఇంటికి పరిగెత్తి పోయి తల్లి ఎదుట నిలబడి, ''నేనెవరు?'' అని అడిగింది. ఒళ్ళంతా బురద పూసుకుని ఉన్న మనీషా వాలకం చూసి ఆమె తల్లి ఇదేదో కొత్త ఆట అనుకుని, ''తెలియడం లేదే! ఎవరు నువ్వు?'' అన్నది. ''ఆహా, వనితా అంటీ చెప్పింది సరిపోయింది! కన్నతల్లి కూడా గుర్తించలేనంత మురిగ్గా ఉన్నానని చెప్పింది!'' అన్నది మనీషా.

## దత్తు




అతిపెద్ద పుచ్చకాయ బరువు 122 కిలోలు telugu.chandamama.com చదవండి

**Avail the loyalty bonus!**

**Chandamama Subscribers will get flat 20% off on subscription renewals! (All Editions)**



# Chandamama!

**Because stories make the world go round...**

**Choose your Chandamama!**

Go to www.chandamama.com or SMS CSHOP to 54646 & we'll get in touch with you!

**Subscribe Now!!**



**Chandamama is available in English and 12 regional languages. Junior Chandamama for children below 9 years is available only in English.**

I want to subscribe to / gift / renew subscription for the following editions of Chandamama:

☐ English ☐ Telugu ☐ Tamil ☐ Kannada ☐ Hindi
☐ Marathi ☐ Gujarati ☐ Oriya ☐ Bengali ☐ Sanskrit
☐ Santali ☐ Malayalam ☐ Assamese ☐ Junior

Name: ..................................................

Date of Birth: .................... Sex :....................

Address: ..................................................

..................................................

..................................................

.................................... City: ....................

State:.................... Pin:....................

Telephone:..................................................

Mobile:..................................................

Email:..................................................

Subscription Number 9for renewals):....................

Gift Subscription to the following address:

..................................................

..................................................

..................................................

..................................................

Enclosed Cheque/DD* for Rupees....................

Cheque/DD No ....................

favouring Chandamama India Ltd on....................

....................................bank.

*Add Rs.60 for non-Chennai cheques. Your subscription will commence in 4 weeks.

Please mail the subscription form to:
**Chandamama India Limited,**
New 2/513 (Old 3/396) Sundeep Avenue East,
2nd Main Road, Chinna Neelankarai,
Chennai - 600041. Phone: (044) 43992828, Fax: (044) 43992829
Email: subscription@chandamama.com
You can also subscribe online at: www.chandamama.com

| Take Your Pick! | 1 YEAR | 2 YEARS | 3 YEARS | 4 YEARS | 5 YEARS |
|---|---|---|---|---|---|
| ENGLISH (Rs. 25/- per copy) | Rs. 300 | Rs. 540 | Rs. 765 | Rs. 960 | Rs. 1125 |
| You Save | | Rs. 60 | Rs. 135 | Rs. 240 | Rs. 375 |
| REGIONAL (Rs. 20/- per copy) | Rs. 240 | Rs. 430 | Rs. 610 | Rs. 770 | Rs. 900 |
| You Save | | Rs. 50 | Rs. 110 | Rs. 190 | Rs. 300 |
| JUNIOR (Rs. 15/- per copy) | Rs. 180 | Rs. 325 | Rs. 460 | Rs. 575 | Rs. 675 |
| You Save | | Rs. 35 | Rs. 80 | Rs. 145 | Rs. 225 |

**Annual Subscription Overseas :** US $40 for English Chandamama, US $30 for Regional Languages, US $25 for Junior Chandamama (including shipping and handling charges) by air mail.


భయమెరుగని నలుగురు
అసలు సంగతులు - 1
చిత్రాలు: గాంధి అయ్య
నా కడుపు తిప్పుతోంది!
నా కళ్ళు మంటగా ఉన్నాయి!
డాక్టర్ దగ్గర...
వింతగా ఉంది... ఒక్క రోజులో ఇన్ని కేసులా...
డాక్టర్ ఆలోచనలో పడ్డాడు.
ఇదేదో తాగునీటి వల్లే అయివుంటుంది.
మొత్తం కాలనీలో సంచలనం.
నీళ్ళు అదోలా ఉన్నాయి.
ఈ రోజుల్లో ప్రతి ఒక్కటీ కలుషితమే!
కాళయ్య లేదా దేవయ్య నుంచే క్యాన్లు కొంటున్నాం.
వెళ్ళి వాళ్ళను అడుగుదాం.


కాళయ్య దుకాణం వద్ద....
నీళ్ళు ఎక్కడి నుంచి తెప్పిస్తున్నావ్?
కొంపతీసి కొలను నుంచి తెప్పిస్తున్నావా ఏం?
లేదండి!
దయచేసి నన్ను నమ్మండి!
దేవయ్య దుకాణంలో
నేనెప్పుడుగాని కలుషిత జలాన్ని సరఫరా చెయ్యను!
ప్రజలకు నమ్మకం కుదరలేదు. క్యాన్లు పరిశోధించారు!
దీపక్, అనిత, జాస్మిన్, మిధున్, జూజో ఆ మాటలు వింటూ అక్కడే ఉన్నారు.
ఆయన డా.చంద్ర కదూ! ఆయన మంచినీటి నాణ్యత, స్వచ్ఛదనం మీద పరిశోధనలు చేస్తాడని మా నాన్న చెప్పారు...

ఆయన మాటలు వినడానికి దగ్గరికెళ్ళారు.

బహుశా... కళ్ళల్లో నీళ్ళు కారడం, మంటలు వీటికీ నీళ్ళకూ సంబంధం లేదను కుంటాను.

అలాగా అంకుల్!

అవును, అవసరమైతే ఈ మంచినీటిని కొంచెం తీసుకెళ్ళి నా ప్రయోగశాలలో పరీక్షించి చూస్తాను.

బావుంది!

సరే, పిల్లలూ మిమ్మల్ని తరవాత చూస్తాను!

ఆ రోజు రాత్రి అనితకు సరిగ్గా నిద్ర రాలేదు.

నకనకలాడుతూన్న నా పొట్టకు ఏదైనా వెయ్యాలి!

ఆమె వంటగది కిటికీ గుండా యథాలాపంగా వెలుపలికి చూసింది.

ఆ... కాళయ్య దుకాణాన్ని ఎవరో తెరుస్తున్నారు?




**Printed and Published by L. Subramanyan at B.N.K. Press Pvt. Ltd., Chennai - 26 on behalf of Chandamama India Limited,**
JVL Plaza, 6th Floor, 626 (Old 501), Anna Salai, Teynampet, Chennai - 600 018. **Editor : L. Subramanyan**

CHANDAMAMA (Telugu) June 2009 Registrar of Newspapers of India No. 1114/57. Regd No. TN/CH(C)/216/09-11
Licensed to post WPP - Inland No.TN/CC(S)Dn/84/09-11, Foreign No. 85/09-11